జనవరి 1978

నవలానుబంధం

# "ప్రేమకు సవాల్"

వడ్డాది సత్యనారాయణమూర్తి

ముఖచిత్రం

* గోపి



ఏలూ

విజయవాడ-

విశాలమైన మర్రిచెట్టు నీడలో కోర్టు బయట అరగంట నుంచీ నిరీక్షిస్తున్నాడతను. తన క్లయింట్స్‌తో మాట్లాడుతున్న లాయర్ శారదాదేవి ఛాంబర్‌లోంచి ఇంకా బయటకు రాలేదు. రమారమి గంటసేపు తమ తరపున వాదించినా ఆ క్లయింట్సుకి ఇంకా తృప్తిలేనట్టుంది. లేనిపోని అనుమానాలతో, సలహాల కోసం ఆమెను వేధిస్తున్నారు.

"పూర్ క్రీచర్స్!....వీళ్ళకేం చెప్పినా అర్థం కాదు...." అకారణంగానే వారిమీద విసుక్కున్నాడు.

ఇంతలో ఎవరో ఆసామీ వచ్చి "టైమ్ ఎంతయిందిసార్!" అని అడిగాడు—అతని ముఖంలోకి వింతగా చూస్తూ.

అతనికి వళ్ళు మండింది. వాడికి కావలసింది, టైమా? తన ముఖమా? విసుక్కుంటూ టైము చెప్పాడు. ఆ వ్యక్తి వెళుతూ వెళుతూ, మరొకసారి అతని ముఖంలోకి చూసి వెళ్ళిపోయాడు. అతనికి మరింత వళ్ళు మండింది. అది నలుగురూ నడిచే రహదారి కాకపోతే, ఈడ్చి నాలుగు తన్నేవాడే.

మరొక పది నిమిషాల్లో ఛాంబర్‌లోంచి బైటకువచ్చింది శారద. వెనుకనుంచి క్లయింట్సు ఏదో అడుగుతున్నారు. వాళ్ళకు జవాబులు చెబుతూ ఆమె, కారు పార్కింగ్‌లో వున్న తన కారు వద్దకు నడిచి వెళుతోంది.

మర్రిచెట్టుక్రింద వున్న వ్యక్తి వళ్ళంతా కళ్ళు చేసుకుని చూస్తున్నాడామెనే— చిన్నపిల్లలు పరుగెడుతున్న రైలుబండిని చూస్తున్నట్టు - వింతగా, ఆతృతగా....

కొన్ని మాసాలుగా నిత్యం వెన్నాడుతున్నాడామెను. రోజూ చూస్తున్నా —అప్పుడే చూసినట్టుగా ఏదో ఆకర్షణ ఆమెలో.... అంతెందుకూ — గంట క్రితమే కోర్టు హాల్లో వాదిస్తుండగా చూశాడామెను. మళ్ళా ఈ గంటలోనే ఏదో కొత్తదనం! చెప్ప లేని ఆకర్షణ!

ఆమె క్లయింట్సుని పంపివేసి కారులో ఎక్కి కూర్చుంది తనే డ్రైవ్ చేసుకుంటూ కాంపౌండ్ దాటి బైటకు వచ్చింది.

అయితే అక్కడ్నుంచి ఆమె నేరుగా ఇంటికి వెళ్ళదని

తెలుసు నతనికి. అందుకనే అడ్డుదారిని సైకిల్‌మీద ఆమెకన్నా ముందు వెళ్లి అక్కడ దగ్గరలోనే వున్న బుక్‌స్టాల్‌వద్ద నిరీక్షించ సాగాడు.

అతని అంచనాగానీ నిరీక్షణగానీ వ్యర్థంగాలేదు. సరిగ్గా అయిదు నిమిషాల్లో ఆమె బుక్‌స్టాలుకు వచ్చింది. ఆ వ్యక్తి ఊహించిన పుస్తకాన్నీ, మరికొన్ని పుస్తకాల్నీ కొనుక్కుని వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయాక, విజయగర్వంతో మిలమిల లాడా యతని కళ్ళు. తృప్తిగా నిట్టూర్చాడు.

* * *

"లాయర్‌గారున్నారా?"

తల వంచుకుని గులాబిమొక్కకు నీళ్ళు పోస్తున్న తోట మాలి, తలెత్తి చూశాడు ఆ మాటవిని.

తలెత్తినవాడు కొన్ని క్షణాలు అలానే వుండిపోయాడు— తన ముందునుంచుని వున్న ఆ రూపాన్ని చూసి. మెడవరకూ ఆకారం మనిషిదే! కాని మెడమీద ముఖం మాత్రం దగ్గరదగ్గరగా. చింపాంజీ ముఖాన్ని పోలివుంది. శరీరం రంగు కూడా నలుపే. ఒక్కమాటలో చెప్పాలంటే ఏ ఆఫ్రికా అడవుల్లోనో తిరిగే వికృతా కారుడు. సభ్యతాయుతమైన దుస్తులు వేసుకువచ్చి ఎదుట నిలబడి నట్లుంటుంది. ఒక్కమాటను బట్టే అతను ఇండియన్ అనీ, అందునా తెలుగువాడనీ అర్థమవుతుంది. ఇంకోక సంగతేమిటంటే ఆ మనిషిని చూడగానే హృదయం జాలితో నిండిపోతుంది.

"నిన్నే అడుగుతున్నానయ్యా! లాయర్‌గారున్నారా?" ఈ సారి అతనిగొంతులో బాధా, విసుగూ ధ్వనించాయి.

అప్పటికి తెప్పరిల్లాడు తోటమాలి.

"ఆ........ ఆ .... వున్నారయ్యా! రండి—" అంటూ ముందుకు దారితీశాడు. అతను లోనికి వెళ్ళాడు.

"కూర్చోండి! —" అంది— శారదాదేవి, అతన్ని చూడ గానే కలిగిన ఆశ్చర్యాన్ని, వింతను కప్పిపుచ్చుకుంటూ. పైగా అతన్ని ఎక్కడో, ఎప్పుడో చూసినట్టనిపించిందామెకు.

"మీరు నన్ను గుర్తించారా?" కుర్చీలో కూచుంటూ అడిగా

డతను-ఆమెనూ, ఆమె చేతిలోవున్న పుస్తకంపైనా పరిశీలనగా చూస్తూ!

"అదే ఆలోచిస్తున్నాను." అంది, ఆమె సాలోచనగా.

"మర్చిపోయారా? మీరు హైస్కూల్లో చదువుతున్నపుడు మీ క్లాసులో ఓ కుర్రాణ్ని అందరూ 'ఆఫ్రికన్ అడివి మనిషి' అనీ, 'చింపాంజీ' అనీ పిలిచేవారు."

బాధతో కూడిన వ్యంగ్యం దొర్లిపోయింది అతనిగొంతులో.

"అవును గుర్తుకు వచ్చింది—" అంది-అతన్నీసారి పరిశీలనగా చూస్తూ. అప్పటికీ ఇప్పటికీ అదే రూపు. పోతే అప్పుడు మనిషి పేలగా, దైన్యపు దృక్కులతో వుండేవాడు. ఇప్పుడు మనిషి కాస్త హుందాగా వున్నాడు. అయితే ఆ కళ్ళలో రవంత ఆత్మవిశ్వాసం, ఓ గ్రుడ్డి వెలుగూ ద్యోతకమౌతున్నాయ్.

"మీ పేరు ఏదో—" అది కూడా గుర్తుకు తెచ్చుకునేందుకు ప్రయత్నిస్తోందామె....

"నా పేరు అప్పటి స్కూల్ రిజిష్టర్లో రాఘవరావు...."

"సరే....ఇప్పుడు ఎక్కడ వుంటున్నారు?" అంది—

"ప్రస్తుతానికి ఈ వూళ్లోనే వుంటున్నాను...." అన్నాడతను—ఈసారి ఆమె కళ్ళలో ప్రతిఫలించే జాలినీ, గొంతులో ప్రతిధ్వనించే సానుభూతినీ గ్రహించాడు.

"ప్రస్తుతం నా కజిన్ బ్రదర్ దగ్గర వుంటున్నాను. ఇంతకీ నాకు వివాహం ఎందుకు కాలేదో అడగరేం?...."

అడిగింది కళ్ళతోనే.

"నాకు నచ్చిన అమ్మాయి దొరకలేదు"

తన విట్టుకి తనే నవ్వుతున్నాడు పెద్దగా.

ఆమె కూడా నవ్వి—"ఎందుకని దొరకలేదు?...." అంది.

"లోకంలో అందరూ అందమైన అమ్మాయిలే కనబడుతున్నారు. చింపాజీ ముఖం గల అమ్మాయి వొక్కర్తె కూడా కనబడలేదు—" అలా అని మళ్ళా ఘొల్లున నవ్వాడు.

ఈసారి అతని నవ్వులో ఆమె పాలు పంచుకోలేక పోయింది. జాలిగా అతని వైపే చూస్తూ వుండి పోయింది.

అది చూచిన వెంటనే టక్కున నవ్వు ఆపేశాడతను —

"శారదా దేవీ! దేవుడు కూడా పొరబాట్లు చేస్తూ వుంటాడు గదూ? అప్పుడప్పుడు!..."

ఆమె దీనికీ సమాధానం చెప్పలేదు. మౌనంగా చేతిలో వున్న పుస్తకం పేజీలు తిరగేస్తూ వుండి పోయింది కొన్ని క్షణాలు. తర్వాత తలెత్తి— "ఇంతకూ మీరేదైనా పని మీద వచ్చారా? లేక వూరికెనే వచ్చారా?" అంది, ఆ సంభాషణను మలుపు త్రిప్పుతూ.

"పని మీదనే వచ్చాను. మిమ్మల్నొక చిన్న సలహా అడగాలి..." అన్నాడతను.

"ఏ విషయంలో ?" అడిగిందామె చేతిలోనున్న పుస్తకం మీద 'మన్మథ' అనే పేరును వ్రేలితో దిద్దుతూ.

"విడాకుల విషయంలో..."

ఆశ్చర్యంగా తలెత్తి చూసిందామె.

"విడాకులా ! ఎవరికి?" అది వింతగా నవ్వుతూ.

అతనూ నవ్వేశాడు—

"మా ఆవిడకు మాత్రం కాదులెండి-మా కజిన్ వొకడున్నాడు—ఆ విషయంలో వాడికి కొన్ని 'లా'పాయింట్స్ కావలసి వచ్చాయి."

"ఏం? ఈ పాయింట్లన్నీ తెలుసుకుని వాళ్ళావిడకేమైనా విడాకులిస్తారా ?" అందామె.

"విడాకులివ్వటానికి, వాడికీ పెళ్ళి కాలేదు."

ఈసారి ఆమె నిజంగా ఆశ్చర్య పోయింది.

"మరి! దీని వల్ల అతనికేం వుపయోగం!"

"మీరిచ్చే ఇన్ఫర్మేషన్ వల్ల తెలుగు పాఠకులకు మరొక చక్కని నవల అందుతుంది."

ఆమె ఈసారి తేలిగ్గా వూపిరి వదిలింది.

"ఓహో ! కథానాయికకు విడాకులిప్పిస్తారన్న మాట.... అంతేనా....?"

"అవును."

"సరే మరొక నవల అంటున్నారు. ఆయన ఇది వరకు ఏమైనా రాశారా ?"

"చాలా రాశాడు. ప్రస్తుతం మీ చేతిలో వున్న నవల అత

విదే...."

ఈ మాటతో తృప్తి పడిందామె. స్ప్రింగులా లేచి, కుర్చీలోంచి ముందుకు వంగి--

"ఏమిటీ? మన్మథా? ఆయనేనా మీ కజిన్? ఆయనకేనా కావాలీ వివరాలు?" అంది గబగబా, గాభరాగా....

ఆ క్షణంలో ఆమె ముఖంలో కనుపించిన సంభ్రమాశ్చర్యాల్నీ, కళ్ళల్లో కనిపించిన కాంతినీ చూచి, చకితుడై పోయాడు రాఘవరావు. అతని చికికళ్ళు పట్టరాని ఆనందంతో, అంతులేని గర్వంతో మెరిసి పోయాయి.

"అవును. అతనే....అతనికే కావాలీ వివరాలన్నీ. మీకభ్యంతరం లేకపోతే"

"అభ్యంతరం సంగతి అలా వుంచండి. అసలిది ముందు చెప్పండి. ఆయన ఎక్కడ వుంటున్నారు?"

ఆమె ఆతృతను చూసి నవ్వుకున్నాడతను.

"గత ఏడాది నుంచీ ఇక్కడే వుంటున్నాడు"

"ఈ వూళ్ళోనే? ఎక్కడ?"

"క్షమించండి. అది చెప్పటానికి అతని అనుమతి కావాలి" తల వంచుకుని చెప్పాడు.

ఈసారి ఆమె హతాశ అయింది. అసహనంగా కుర్చీలోంచి కదలి "ఏం? ఎందుకని? పత్రికల వారినీ, పబ్లిషర్స్‌నీ అదే విధంగా కోరారట, తన వునికిని చెప్పవద్దని. కనీసం తన ఫొటోని కూడా ఏ పత్రికలోనూ, పుస్తకంలోనూ వెయ్యలేదు. ఏమిటి కారణం?" అంది.

"కారణం అంటూ ఏమీలేదు. ప్రజలంటే అతనికి భయం. ఒక విధంగా అయిష్టతకూడా. అందుకే అతను ప్రజల్లోకి రాలేదు."

ఆమె మాట్లాడలేదు కాసేపు. తన చేతిలో వున్న పుస్తకం మీది 'మన్మథ' పేరును తదేకంగా చూస్తూ వుండి పోయింది. తరువాత ఆ పేరునే అడుగుతున్నట్టుగా "ప్రజలంటే ఎందుకంత అయిష్టత? ప్రతి రచనలోనూ అది లీలగా కనిపిస్తూనే వుంది. ప్రజల్లోకీ, సమాజంలోకీ నడిచి రావాలని వుండదా?" అంది.

"ఎందుకు వుండదు? కాని, చెప్పానుగా—అతనికి భయం.

ఎవరైనా వచ్చి చేయి అందిస్తే తప్పక వస్తాడు. కానీ, అతని కోసం ఎవరూ రారు, వచ్చినా చేయి అందించరు” బరువుగా నిట్టూర్చాడతను.

“బాగుంది మీరనేది. అసలతను ఎక్కడున్నాడో తెలిస్తే గదా? ఎవరైనా రావటానికీ చెయ్యి అందించటానికీ,” అందామె. “నా మట్టుకు నేనే ఎంతో ప్రయత్నం చేశాను. అతన్ని కలుసు కోవాలనీ, అతనితో మాట్లాడాలనీ కానీ, ఎక్కడా దొరకందే?”

ఈసారి సంభ్రమాశ్చర్యాలు అతనిపై దాడి చేశాయి.

“నిజంగనా? మీరతని కోసం నిజంగా ప్రయత్నించారా? ఎప్పుడు?”

“ఎప్పుడేమిటి? చాలాసార్లు. ఎన్నో పత్రికల ద్వారా, ఎందరో పబ్లిషర్సుద్వారా. కాని, లాభం లేకపోయింది” అందామె నిరాశగా నిట్టూరుస్తూ.

“మీ కొక నిజం చెప్పమంటారా?”

“ఒక్కటేం ఖర్మ. అన్నీ నిజాలే చెప్పండి....” అందామె నవ్వుతూ...

“మన్మథకు, తన అభిమానుల్లో కెల్లా మీరే ముఖ్యులన్న నిజాన్ని మీరు నమ్ముతారా?” అన్నాడు. అని, ఆమె ముఖంలోని భావాలను చదవ సాగాడు.

ఆశ్చర్యంతో, ఆనందంతో వెలిగి పోయిందామె ముఖం.

“నిజంగా?!” అన్నది ముందుకు వంగి.

“నిజం. వివిధ పత్రికల్లో మీరు ఇచ్చిన పొగడ్తల్నీ, విమర్శల్నీ, పబ్లిషర్సు ద్వారా అందిన ప్రశంసా పత్రాల్నీ జాగ్రత్తగా పదిల పరచుకున్నాడతను. నిజంగా అతని కవితాప్రవంతిని పరుగు లెత్తించేవి మీ ప్రశంసలే. అందుకనే అతని అభిమానుల్లో ముఖ్యులైనారు మీరు. అప్పటి నుంచీ, మిమ్మల్ని చూడాలనీ, మీతో మాట్లాడాలనే కోరిక అతనిలో బలంగా నాటుకుంది. అందుకే ఏడాది క్రిందట మిమ్మల్ని వెదుక్కుంటూ ఈ ఊరు వచ్చాడు. మిమ్మల్ని చూశాడు.”

“నన్ను చూశారా?!” కళ్ళింతగా చేసుకుని అడిగిందామె.

“అవును, ఒకసారికాదు. ఎన్నోసార్లు.”

"సరే అతన్ని కలుసుకునే ఏర్పాటు చెయ్యగలరా...."

"తప్పకుండా....ముందు మీరీ ప్రశ్నలకు జవాబులు వ్రాసి ఇవ్వండి. అది చూసి, మీ గురించి అతనికి చెబుతాను." అన్నాడు, జేబులోంచి ఒక కాగితం తీసి ఆమెకిస్తూ.

ఈ లోపు కాఫీ వచ్చింది—

అది తెచ్చిన కుర్రాడ్ని చూసి "ఏమిరా! ఇంత ఆలస్యం చేశావ్?" అని, రాఘవతో "కాఫీ తీసుకోండి, చల్లారిపోతోంది" అంది.

తరువాత తనొక కప్పుతీసుకొని, ఒకచేత్తో కప్పును పెదాల ముందుంచుకుని, కాఫీని సిప్ చేస్తూ, రాఘవ అందించిన కాగితాన్ని చదవసాగింది.

అది ప్రశ్నాపత్రం కాదు—విజ్ఞాపనా పత్రం.

"కుమారి శారదాదేవిగార్కి" అని సంబోధిస్తూ వ్రాశాడు.

వివిధ పత్రికలలో మీరు నా రచనలపై వెలిబుచ్చిన అభిప్రాయాలూ, ప్రశంసలు, విమర్శలూ చదివాను. అవి నన్నెంతో ఉత్సాహ పరిచాయి. నిజానికి మీ వంటి అభిమానుల ప్రోత్సాహం వల్లనే, నేనీనాడు రచనలు చేయగలుగుతున్నాను. ముఖ్యంగా మీ సలహాలు, ప్రశంసలు, విమర్శలు నాకు అమూల్యమైనవి. వాటిని అతి జాగ్రత్తగా నా హృదయపు లోతుల్లో దాచుకున్నాను. వీలైతే ఏదైనా వ్రాస్తే సహేతుకంగా వ్రాయటం నా కలవాటు. నా క్రొత్త రచనలో విడాకులవిషయమై కొన్ని న్యాయసూత్ర సంబంధమైన సమస్యలు ఎదురైనాయి.వాటినిగురించి వివరంగా తెలుసుకోకుండా వ్రాయటం భావ్యంగాదు కాబట్టి, ఈ దిగువ పేర్కొన్న నాలుగు సమస్యలకూ మీ 'కోడ్ రూల్సు'తో, సహా నాకు తగిన జవాబులు వ్రాసి ఇవ్వగలరని ప్రార్థిస్తున్నాను. శ్రమ యిచ్చినందుకు క్షమించగలరు-

ఇట్లు

భవదీయుడు—మన్మథ.

ఉత్తరాన్ని మరొకసారి చదువుకొని, దాని క్రింద రాసిన నాలుగు ప్రశ్నలూ చదువుకొందామె. చాల చిన్నప్రశ్నలు. జవాబు చాల తేలిక. రచనా వ్యాసంగంలో అంతచిన్న విషయాలకు కూడా ప్రాముఖ్యత నిస్తున్న అతన్ని మనసులోనే మెచ్చుకుంది. తరువాత

లేచి వెళ్ళి రాక్‌లో వెతికి, రెండు పుస్తకాలు తీసుకువచ్చి, ముందు వేసుకుని పేజీలు త్రిప్పసాగింది, సమాధానాలు వ్రాయడంకోసం.

పది నిముషాల్లో ఆమె, ప్రశ్నలన్నిటికి జవాబులు వ్రాసింది.

"ఇవిగో ఆయన ప్రశ్నలకు జవాబులు. వీటితోపాటు యీ శుభాకాంక్షలు కూడా అందజేయండి అంటూ తన లెటర్‌పాడ్‌పై

శ్రీ మన్మథ గార్కి—

మీ అసంఖ్యాకమైన పాఠకుల్లో నేనొక ఇసుక రేణువును. మీరు కొత్త నవలవ్రాసేటపుడు నా సలహా తీసుకోవడం నాకు గర్వ కారణంగావుంది. ఈ రచన వెనుక రచనలకన్నా ఎక్కువ ప్రజా దరణ పొందాలని ఆశిస్తున్నా.

— శారదాదేవి

అని వ్రాసి, ఆ రెండు కాగితాలనూ ఒక కవరులో పెట్టి, కవరు జాగ్రత్తగా అంటించి, రాఘవ చేతికిచ్చింది.

రాఘవ ఆ కవరు తీసుకుంటూ—

"చాలా థాంక్స్!.... అవసరం వస్తే మళ్ళా మీ సలహాల కోసం వస్తాను—మీ కభ్యంతరం లేకుంటే-" అన్నాడు కుర్చీ లోంచి లేస్తూ.

"తప్పకుండా you are always welcome! ఈ సారి ఆయన్ను కూడా తీసుకురండి." అంది.

రాఘవ ఇబ్బందిగా ముఖం పెట్టి "అలాగే" అన్నాడు.

"మీరు అలాగే అంటే లాభంలేదు. నా రిక్వెస్టుగా మరీ మరీ చెప్పండి."

"ఓ....." అని వెళ్ళిపోయాడతను.

* * *

"కోర్టు నించి ఇంటికి వచ్చిన శారద అతన్నిచూసి సంతో షించినా! ప్రక్కన మన్మథ లేకపోవడంతో కొంచెం చిన్నబో యింది. అయినా అతను చేసిన 'విష్' ను అందుకుంటూ....

"ప్లీజ్ జెస్టెమినిట్ .. "అంటూ నవ్వుతూనే అతన్ని పలక రించి, లోపలకి వెళ్ళిపోయిందామె. ఒక్క నిముషం అన్నదల్లా ఇరవై నిముషాల తరువాత టాయిలెట్ అయివచ్చింది.

"వస్తూనే—ఏమండీ! మీ కజిన్‌కి ఇంకా బిడియంపోలేదా!"

అంది, అతని ఎదురుగా సోఫాలో కూర్చుంటూ.

"బిడియం సంగతి అలా వుంచండి. విన్న మీరిచ్చిన సమాధానాలు, పంపిన శుభాకాంక్షలు చూసి ఉక్కిరిబిక్కిరయ్యాడు. మీ అంత బిజీ లాయరు అడిగినవెంటనే సమాధానం ఇవ్వడమే కాకుండా సాహిత్యం పట్ల, ముఖ్యంగా అతని రచనలపట్ల మీరు చూపిన అభిమానానికి ధన్యవాదాలర్పించాడు."

ఆమె నవ్వుతూ అంది—

"భలే విచిత్రమైన మనిషి. అజ్ఞాతంలో వుండి అతను పంపిన ధన్యవాదాలు నా కందలేదని చెప్పండి."

"అదేమిటి! నేనందజేస్తున్నానుగా."

"స్వయంగా వచ్చి చెప్పుకున్నది వేరు. ఇతరుల ద్వారా చెప్పించింది వేరు. ఇంతకూ ఆయన బయటకు రానంటారా?"....

"రాననటంలేదు... మీకు ముందే చెప్పాను, వాడికి గర్వం, అతిశయం లాంటివేమీ లేవని. కాని, వాడికో అలవాటుంది.— రాస్తున్న నవల పూర్తయ్యే వరకూ ఎక్కడికీపోడు. ఎవరితోను మాట్లాడడు. అందులోనూ మీ వంటి వారితో అసలు పరిచయం పెంచుకోడు."

"ఏం?.... నేనంత దుర్మార్గురాలినా?"

అతను హాయిగా నవ్వుతూ—

"ఒక విధంగా అంతే. మీ అందచందాలతో అతన్ని 'కార్యదీక్ష" అనే మార్గం నుంచి తప్పించేంత దుర్మార్గులు" అన్నాడు, కళ్ళంతా ఆరాధననూ, అనురాగాన్ని నింపుకుని.

అయితే, ఆ చీకికళ్ళలోని ఆరాధనగానీ, అనురాగాన్నిగానీ, గ్రహించే స్థితిలో లేదామె. ఆమె మనసంతా తెరవెనుక నున్న 'మన్మథ' చుట్టూ పరిభ్రమిస్తోంది.

ఇది ఎంత అద్భుతమైన విషయం! ఎవరి రచనలు చదివితే తన హృదయం పులకరిస్తుందో, ఎవరి వూహతో తన శరీరం వుత్తేజిత మౌతుందో, ఆ వ్యక్తి నేడు తననే వెదుక్కుంటూ వచ్చాడు. అతని కలంనుండి వెలువడే మరొక మహోత్కృష్టమైన నవలకు తన సహకారం....ఇది నిజంగా అద్భుతమైన సంఘటన! కేవలం కలలాంటి అనుభవం! ఇలా శాశ్వతంగా అతని రచనా

వ్యాసంగానికి సహకరిస్తూ వుండిపోతే ....

ఆ వూహ కలగటంతోనే ఆమె గుండెలు బరువెక్కాయి. చెక్కిళ్ళు కెంపువర్ణం దాల్చాయి. కేవలం వూహామాత్రంతోనే యింత వేగంగా, బలంగా, తన హృదయంలోంచి పెల్లుబుకుతోందే, ఈ అనుభూతి, ఈ తీయని బాధ .... అనుభవంలోకి వస్తే యెంత బాగుంటుంది!...

"అన్నట్టు మరిచేపోయాను. మావాడు మీకొక వుత్తరం ఇచ్చాడు" అంటూ జేబులోంచి గులాబి రంగు కవరు నొకదానిని తీసియిచ్చాడు.

ఆ కవరును చూడగానే ఝల్లుమన్నదామె శరీరం. వణుకు తున్న చేతుల్తో మెల్లగా అందుకున్నది కవరును.

అతను వళ్ళంతా కళ్ళు చేసుకుని, వుత్తరాన్ని చదువుతున్న ఆమె భావాల్ని చదవసాగాడు.

కాని, తను ఆశించిన భావాలు కనిపించలేదామె ముఖంలో. చదవటం ప్రారంభించిన కొద్ది క్షణాల్లోనే ఆమె ముఖంలోని మంద హాసం మాయమైంది. గంభీరంగా, సాలోచనగా ఒకసారి తలెత్తి రాఘవవైపు చూసిందామె. రాఘవ చటుక్కున చూపులు దించు కున్నాడు. ఉత్తరాన్ని చదవటం ముగించిన ఆమె, ముఖాన్ని కందగడ్డలా చేసుకుని, కళ్ళలో నిప్పులు కురిపిస్తూ, సోఫాలోకి విసిరికొట్టింది, చేతిలో వున్న కాగితాన్ని.

మ్రాన్పడిపోయాడు రాఘవరావు.

"ఏమిటతని వుద్దేశం? ఏదో అభిమాన పాఠకురాలిగా ప్రశం సలు పంపిస్తే ఏమిటీ ప్రేమ పైత్యం! .... అంతటి మహా రచ యిత కూడా ఒక ఆడపిల్ల ఉత్తరం రాస్తే యింతలో అపార్థం చేసుకుంటాడనుకోలేదు. పైగా ఫొటో కావాలంట ఫోటో!....ఏం? నా ఫోటోని చూడందే అతనికి భావాలు రావా? ... కాస్త వొళ్ళు దగ్గర పెట్టుకుని మెలగమని చెప్పండి, అతనికి. లీడింగ్ లాయర్ శారదాదేవికి మరొకసారి ఇటువంటి వుత్తరం వచ్చిందంటే కట కటాల వెనుక కూచుని కవిత్వం రాయాల్సి వస్తుందని చెప్పండి" బుసలు కొడుతోందామె.

తగిలిన షాక్‌నుంచి రాఘవరావింకా కోలుకోలేదు.

"ఉండండి. తగిన జవాబు రాసిస్తాను." అంటూ ఆమె లోనికి వెళ్ళి, పది నిమిషాలలో చేతిలో అంటించివున్న కవరుతో తిరిగి వచ్చింది తల వంచుకుని అయోమయంగా కూచుని వున్న రాఘవతో.

"ఇదుగో....దానికి తగినట్టుగా సమాధానం. తీసుకువెళ్ళి అతని కివ్వండి. మళ్ళా మీరు మరొకసారి ఉత్తరాన్ని తీసుకువచ్చే రంటే మీ మర్యాద కూడా దక్కదు. జాగ్రత్త!...." అంది, కవర్ని అతని ముందు సోఫాలో పడవేస్తూ.

* * *

"శ్రీ మన్మథగారికి,

-మీరు వ్రాసిన లేఖ అందింది. అందులో వ్యక్తపరచిన మీ ప్రేమను గ్రహించాను అనుగ్రహించాను. మీరు వ్రాసినట్టుగా ఇది మీ జీవితానికే కాదు-నా జీవితంలో కూడా పెద్ద మలుపు. ఆ మలుపులో అందమైన బాట. దానికిరు ప్రక్కలా పడుచుకుని వున్న అందమైన వుద్యానవనాన్ని చూస్తూ, మీతోబాటుగా మీ చేయినందుకుని పయనించటం కేవలం నా అదృష్టంగా భావిస్తున్నాను. కవిత్వం రాస్తున్నానని నవ్వుకుంటున్నారా? ఏమో .... మీ గాలి యిటు మళ్ళింది. అయినా మీముందు నేనెంత?...ఇసుక రేణువును. మీరు వ్రాసినట్టు వజ్రపు తునకను గాదు. మీరు కోరినవిధంగా నా ఫొటోని దీనితో జతజేర్చి పంపుతున్నాను. అయితే ఒకటే షరతు. మీ రచనలలో ఎక్కడా నన్ను గురించిన వర్ణన రాకూడదు. వచ్చిందో-మిమ్మల్ని కటకటాల వెనక కూర్చోబెట్టి కవిత్వం రాయిస్తాను-అంటే తెలిసిందిగా!.... ఇక వుండనా,

—మీ శారద."

ఉత్తరం చదువుకున్న రాఘవ ఉక్కిరి బిక్కిరయ్యాడు. "మీ శారద! మీశారద!"...."నా శారద, నా శారద"పిచ్చిగా అరుస్తూ పట్టరాని ఆనందంతో రెండు చేతుల్తో ఆ ఉత్తరాన్ని పట్టుకుని గట్టిగా గుండెలకేసి బాదుకున్నాడు రాఘవరావు వురఫ్-మన్మథ.... ప్రపంచాన్ని జయించిన అలెగ్జాండర్‌కు కూడా కలుగలేదేమో అంత సంతోషం!.... అంత గర్వం!... ప్రపంచ దేశాలన్నీ కలిసి ఒక్కసారిగా తనను ప్రపంచ రాజ్యాలకు అధినేతగా ఎన్ను

కున్నంత అనుభూతి.

"శారదా!"

పిచ్చిగా, గట్టిగా అరవాలనుకున్న తన అరుపు, ఆనందాతిశయంతో పోటీ పడలేక, గొంతులోనే అణగారి పోయింది..... టేబుల్ పై నవ్వుతున్న శారద ఫొటోను వణికే చేతుల్తో ఆప్యాయంగా అందుకుని, తన బండ పెదవుంతో మృదువుగా చుంబించాడు.

సిల్లీగర్ల్!.... తనవెంత హడలుగొట్టింది ఈ దెబ్బతో తనను కోర్టుకీడ్చి జైలుకు పంపుతుందనుకున్నాడు. ఇలాకాదు. ఆమె చేసినదాన్ని ఆమెకే త్రిప్పికొట్టాలి.

ఆ తరువాత రెండు రోజుల వరకూ మనసు నెలాగో నిగ్రహించుకుని ఆమెను కలుసుకోవటం మానివేశాడు.

మూడవరోజు వుదయం అతను వెళ్ళే వేళకు ఆమె ఆఫీసు రూంలో తన క్లైంట్స్‌తో ఏదో కేసును గురించి చర్చిస్తుంది.

అతను ముందు హాల్లో కూచుని, కుర్రాడి ద్వారా విజిటింగ్ కార్డు పంపాడు.

మరునిమిషంలోనే ప్టాస్టీలు బైటకు రావటం, తనను లోపలకు రమ్మని కబురురావటం జరిగింది.

భయపడుతున్న వాడిలా వెళ్ళి, నమస్కారం చేశాడు రాఘవరావు.

నవ్వుతూ "కూచోండి." అంది శారద.

"అమ్మయ్య! నవ్వుతున్నారన్నమాట. మళ్లా గుడ్లురిమి జైలుకు పంపుతారేమోనను కున్నాను" అన్నాడు కూర్చుంటూ.

"జైలుకు పంపటమెందుకు? మీ కజిన్ చెప్పలేదా?" అందామె ఆశ్చర్యంగా.

"వాడు చెప్పటమేమిటి? నేనే చెప్పేశాను. ఇంక మీ ఆశ విరాశ చేసుకోమని."

"అంటే?!....మీరు ఉత్తరాన్ని అతనికివ్వలేదా?...." అంది అయోమయంగా.

ఈసారి అతను తలవంచుకుని- "లేదు" అన్నాడు.

"వాట్?!....." ఆమె కుర్చీలోంచి ఎగిరి పడింది. "ఎందు

కివ్వలేదూ ?....మీ కెవరిచ్చారా అధికారం ?...." అంది కళ్ళల్లో నిప్పులు కురిపిస్తూ.

"నా సోదరుడు కాబట్టి నాకు నేనే పుచ్చుకున్నాను, ఆరోజు మీ కోపం చూచి. మీరు ఆ ఉత్తరంలో ఇంకా ఎంత తీవ్రమైన భాష వుపయోగించారోనని భయపడ్డాను. అసలే వాడిది సున్నితమైన మనసు. తిరస్కారాన్నిగానీ, నిందనుగానీ అంత తేలిగ్గా తీసుకోలేడు. అటువంటప్పుడు మీ వుత్తరాన్ని చూసి ఏం అఘాయిత్యం చేస్తాడోనని—"

"ఊం....అని ?"

"ఆ వుత్తరాన్ని వాడికివ్వకుండా చించిపారేశాను."

"ఛీ....చింపి పారేశారా ?! మీ కేమైనా బుద్ధుందీ ?....మీ కసలు మ్యానర్స్ తెలుసా? ...." పిచ్చిదానిలా అరచిందామె. ఎదురుగావున్న వానరావతారాన్ని కాల్చి చంపేయాలన్న కసి కనిపిస్తోందామె కళ్ళలో....

"మీ రందులో మ్యానర్స్ లెస్‌గా ఏం రాశారోనని....అది చూసి మావాడు ఏ ఆత్మహత్యో చేసుకుంటాడేమోనని...."

"ఆ !....ఏమోనని....ఏమేమోననుకుని ఆవుత్తరాన్ని చింపి పారవేశారన్నమాట. అంతేనా ?...."

అంగీకారంగా మౌనం వహించాడు.

ఆమెకు ఏడుపు వచ్చినంత పనైంది. అవటమేమిటి ? కన్నీరు సుడులు తిరిగి కళ్లు రెండూ నిండు తటాకాలైనాయి.

ఆమె కన్నీరును చూడగానే సడలిపోయిందని బింకం....

"శారదాదేవీ !" అన్నాడు గొంతంతా జాలినీ, ఆప్యాయతనూ నింపుకొని. "ఏమిటా కన్నీరు ?"

ఆమె చటుక్కున కన్నీరు తుడుచుకుని "ఏమిటా ? మీరు చేసిన తెలివి తక్కువపనికి ఫలితం...." అంది తలవంచుకుని.

"నేనేం తెలివితక్కువ పనీ చేయలేదు. ఇటు చూడండి ! ఆ వుత్తరాన్ని తీసుకువెళ్ళి నేరుగా అతనికే ఇచ్చివేశాను."

"నిజంగా ?!" అందామె, చటుక్కున తలెత్తి నమ్మలేనట్టుగా.

"నిజంగానే....అది చదువుకుని అందులోని తన ఆరాధ్య

దేవత ఫొటోని చూస్తూ, ఈ రెండురోజులూ నిద్రాహారాన్ని మనిని వేశాడు. ఆ ఫొటోని ఫ్రేం కట్టించి, దాని క్రింద ఆ ఉత్తరాన్నుంచి గంటల తరబడి అలానే కూచుండిపోతున్నాడు."

ఈసారి ఆమె అంతరంగంలోని ఆనంద తరంగాలు సుడులై సెలయేరులై కళ్ళల్లోంచి దుమికాయి.

ఆ కమనీయ దృశ్యాన్ని చూసి మైమరచిపోయాడు రాఘవ రావు. ఇన్నాళ్ళకు తనకోసం దుఃఖించే, ఆనందించే వ్యక్తి, తన తల్లి తరువాతే ఇన్నాళ్ళకు, ఈ శారద, ఈ దేవకన్య, దివి నుండి దిగి వచ్చింది!!

"శారదాదేవీ! ముక్కూ మొహం తెలియని అతనంటే మీ కెందుకంత ఆరాధన. అతనెవరో ఎలా వుంటాడో తెలియకుండానే మీ కెందుకింత ప్రేమ?"

"ఏమో నాకు తెలీదు. ఇప్పుడిప్పుడ నిపిస్తోంది. ఇది నిన్నా మొన్నా జనించిన అనురాగం కాదు. ఎన్నిజన్మల రాగబంధమో, ఈ జన్మలో కూడా పెనవేసుకొంది. ఇది అతని పేరునుబట్టి, రూపా న్నూహించుకుని పెంచుకొన్న ప్రేమకాదు, నా ప్రమేయం లేకుం డానే నాకు తెలియకుండానే బిగుసుకున్న ప్రేమ బంధం! పవిత్ర బంధం!....మీకు నమ్మకం లేకపోతే నావెంటరండి." అంటూ లేచి లోపలిగదిలోకి దారితీసింది.

అతను మంత్ర ముగ్ధునిలా లేచి వెళ్ళాడు ఆమె వెంట.

అది, ఆమె ప్రత్యేకంగా ఏర్పరచుకున్న రీడింగ్ రూం. అక్కడ గోడలకు నాలుగైదు రాక్స్ వున్నాయి. ఒక మూలగా అందమైన రోజ్‌వుడ్ రాక్....వాటన్నిటినిండా పుస్తకాలే....

"ఇదుగో ఇటు చూడండి! ...ఈ రాక్ ప్రత్యేకంగా మన్మథ పుస్తకాల కోసం ఏర్పాటు చేసింది. ఇందులో ఇంకొకరి పుస్తకానికి తావులేదు."

సంభ్రమంగా అటు చూశాడతను. అది చాలా ఆకర్షణీ యంగా తయారు చేసిన నాలుగరల రాక్. అందులో అన్నీ తన పుస్తకాలే అతి చక్కని డిజైన్‌గల ఆ రోజ్‌వుడ్ రాక్ బజార్లో ఎక్కడా దొరకదు. ప్రత్యేకంగా చేయించినదై వుండాలి.

ఉప్పొంగుతున్న హృదయాన్ని అదుపులో పెట్టుకుంటూ,

ఆ రాక్ కి మరింత దగ్గరగా వెళ్ళి చేత్తో ఆప్యాయంగా నిమిరాడు. అద్దంలాంటి ఆ తళతళలో తన వికృత రూపం కనబడింది. వికృతంగా నవ్వినట్టనిపించింది.

అంతే!....చటుక్కున చేతిని తీసివేసి, వెనుదిరిగి పోయాడతను. అంతవరకూ కళ్ళలో వెలిగిన కాంతి, హృదయంలో రేగిన దుమారం గప్పున ఆరిపోయింది. గర్వం తలవంచుకుంది.

అంతలోనే మారిపోయిన అతని ప్రవర్తన ఆమెకు అర్థం కాలేదు.

"ఏమైందీ?....ఎందుకలా అయిపోయారు?"

కొన్ని క్షణాలు మాట్లాడలేకపోయాను. తర్వాత తలెత్తి, "శారదాదేవీ! మీరు నిజంగా మన్మథను ప్రేమిస్తున్నారా?" అన్నాడు.

అది అర్థంలేని ప్రశ్నలా అనిపించిందామెకు. ఫక్కున నవ్వబోయి తమాయించుకుంది. అయితే స్త్రీ సహజమైన సిగ్గును మాత్రం ఆపుకోలేకపోయింది.

"బాగుంది. ప్రేమలో నిజమైనదీ అబద్ధమైనదీ వుంటుందా?" అంది తలవంచుకుని, పైటచెంగుని వ్రేలికి చుట్టుకుంటూ.

"క్షమించండి. నా ఉద్దేశం అదికాదు. ఒకసారి మీలో మీరు ప్రశ్నించుకోండి. మన్మథ కేవలం, ప్రఖ్యాత రచయిత అయినందుకే ప్రేమిస్తున్నారా? లేకుంటే మీకు తెలియని అతని వ్యక్తిత్వాన్ని రూపలావణ్యాన్నిబట్టి ప్రేమిస్తున్నారా?"

"ఇందులో ఆలోచించవలసిందేముంది? రూప లావణ్యాల ప్రసక్తే లేదిక్కడ. అతనెవరో ఎలా వుంటాడో నాకు తెలియదు. పోతే-అతని రచనల వల్లనే వుత్తేజితురాలనైనాను. నాకు తెలియకుండానే నామనసు అతనివైపు మొగ్గింది. అయితే అది వ్యామోహం మాత్రం కాదు. ఎందుకో, ఇంతకన్నా పెద్ద రచయితల గ్రంథాలు చాలా ఉన్నతమైనవే చదివాను. అప్పుడుకూడా నా హృదయం ఇంతలా పరవశించిపోలేదు. అందువల్ల నా ప్రేమ నా మట్టుకు సిన్సియర్ అనే అనిపిస్తుంది. ఇక వ్యక్తిత్వ మంటారా—అది అతని రచనల్లోనే కనిపిస్తోంది."

"పొరబడుతున్నారు. ఒక్కొక్కసారి చెప్పేవి శ్రీరంగనీతులే కావచ్చు."

"లేదు. ఈయన విషయంలో అలాకాదని నాకెంతో నమ్మక ముంది. పోనీ, అతని సోదరుడన్నంటున్నారు కదా? మీరు చెప్పకూడదూ అతని వ్యక్తిత్వ మెలాంటిదో?"

"నా సోదరునిగా చెప్పాల్సివస్తే అణిముత్యంలాంటి వ్యక్తిత్వం. పోతే కాస్త పిరికివాడు. లోకమంటే భయం."

"ఎందుకూ భయం?"

"ఎందుకేమిటి? అది అనుక్షణం అతన్నీ, అతని రూపాన్నీ చూసి వెక్కిరిస్తుంది. అందుకే అంతగొప్ప రచయిత అజ్ఞాతంగా వుండి పోయాడు."

ఆమాట వినగానే శారదగుండె దడదడ లాడింది. అనుమానంగా అతనివంక చూస్తూ "అంత వికృతంగా వుంటుందా, అతని రూపం?" అంది.

"అవును. అందమైన అతని సాహిత్యవనానికి ఆరూపం ఒక దిష్టిబొమ్మ. శారదాదేవీ! మనిషికి ఇంతకన్నా శిక్ష ఏమైనా వుంటుందా?" అన్నాడు.

ఆమె జవాబు చెప్పలేదు. ఏదో ఆలోచిస్తూ, వుండిపోయింది కాస్సేపు. తరువాత ఇటు తలత్రిప్పి సాలోచనగా అతనివైపు చూస్తూ—"వికృత రూపం అంటే?...." అంది.

ఇక ఆగలేదు అతను. తెర తొలగించుకుని బైటకువచ్చాడు. తన ముఖాన్ని తర్జనితో చూపించుకుంటూ—"ఇదే శారదా! ఇదే.... ఆ వికృత రూపం! ఇదే ఆ మన్మథుడి, అసలు రూపం!! నా సోదరుడు అనేవాడు కేవలం ఒక అదృశ్య వ్యక్తి....నాపై మీకు గలది వ్యామోహమో, ప్రేమో తెలుసుకునేందుకే అతన్ని సృష్టించాను. నేను మిమ్మల్ని మోసం చేశానని భావిస్తే మాత్రం క్షమించండి" అన్నాడు.

గదిలో భయంకర నిశ్శబ్దం పేరుకుంది.

అతను మెల్లగా తలెత్తి చూశాడు. కొయ్యబొమ్మలా నుంచున్న ఆమెను చూసి, భయంతో "శారదాదేవీ!" అని పిలిచాడు, తనకే వినబడనంత మెల్లగా.

ఆ పిలుపుతో ఆమె తల ఎత్తింది. చలిస్తున్న నేత్రాలతో ఒకసారి అతని, చింపాంజీ ముఖంవైపు చూసింది. మరుక్షణమే

వెనుదిరిగి పరుగెడుతున్నంత వేగంతో వెళ్ళిపోయింది.

అతను విభ్రాంతితో "శారదాదేవీ!" అని పిలిచిన పిలుపునకు ఆమె వెనుదిరిగి చూడనైనా లేదు. ఆమెకు తెలుసు! తను వెనుదిరిగినా, మాట్లాడినా అల్లకల్లోలమైన తన హృదయ సాగరం చెలియలి కట్టదాటి పోతుందని, ఆ ప్రళయంలో తనూ, అతనూ కొట్టుకుని పోతామనీ....

కాని, తన ఆ ప్రవర్తనను అతను తిరస్కారంగా తీసుకుంటాడనీ, హర్ట్ అవుతాడనీ తేలుసుకోలేకపోయింది.

ఇంతకూ తను దురదృష్టవంతుడు. తన రూపం తన పాలిటి శాపం....తను ఎప్పటిలా తెర వెనుకనే వుండిపోతే—తనను వెదుకుతూ ఆమె అక్కడనే వుండేదేమో....హఠాత్తుగా తెరను తొలగించటంతో—వరమియ వచ్చిన దేవత భక్తుడ్ని చూసి హడలి పారిపోయింది.

ఇంక తనకిక్కడ ఏం పని?....ఇక్కడికీ అధ్యాయం ముగిసింది....మళ్ళా తెరవెనుకకు, తన అజ్ఞాన జీవితంలోకి, వంటరి తనాన్ని వెదుక్కుంటూ వెళ్ళిపోవాలి.

కాని, ఎట్లా? ఎట్లా వెళ్ళిపోవటం?....తన జీవితంలో ఒకే సారి, ఇంద్రధనస్సులు విరిసిన ఈ ప్రదేశాన్ని, ఈ పరిసరాల్ని, మత్తెక్కించే సౌరభాన్ని వెదజల్లే ఈ వాతావరణాన్ని ఎలా వదిలి పోవటం?....అయినా తప్పదు వెళ్ళిపోవాలి.

ఎప్పుడో తనకు తెలియకుండానే అక్కడవున్న సోఫాలో కూలబడిపోయిన అతను లేచి నుంచున్నాడు.

ఆ నిశ్చయానికి వచ్చిన వెంటనే అతనొక్క క్షణం కూడా అక్కడ నిలువలేదు.

లేచి, అటూ ఇటూ చూడకుండా, వెనుదిరిగి చూడకుండా చరచరా ఆ గదిలోంచి బైటకు వచ్చాడు.

గది బయట ఎదురుగా ఆమె!!....

అంతే.....ఠక్కున ఆగిపోయాడు.

అంతవరకూ ఏడ్చినందుకు గుర్తుగా వుబ్బిపోయిన కళ్ళు, దుఃఖాతిరేకంతో జేవురించిన ముఖం, పైపెచ్చు తనవంకే పరిశీల

నగా చూస్తోంది. ఆ చూపుల్ని తట్టుకోలేక తలవంచుకున్నాడు రాఘవ.

"క్షమించండి. మీకు బాధ కలిగించాను." అన్నాడు తల వంచుకునే.

ఆమె మాట్లాడలేదు. మౌనంగా అతన్ని తప్పించుకుని గదిలోకి వెళ్ళిపోయి "లోనికి రండి!" అంది జీరబోయిన గొంతుకతో.

అతను సంశయిస్తూ నుంచున్నాడు.

"దేనికి సంశయిస్తున్నారు? రండి, లోపలికి" అంటూ వుబికి వచ్చే కన్నీటిని కనబడనీయకుండా ఎదురుగా నున్న సోఫావైపు నడిచింది.

చేసేది లేక ఆమె ననుసరించా డతను.

"కూర్చోండి!" అంది ఎదురుగా నున్న మరొక సోఫా చూపుతూ, తనకు అల్లంత దూరంలో స్తబ్ధంగా నిలబడి పోయిన అతన్ని.

మంత్రముగ్ధుడిలా కూచున్నాడు.

ముందుకువంగి మోకాళ్ళపై మోచేతులానించి, అరచేతుల్లో గెడ్డాన్నుంచుకుని, మళ్ళా అతనివైపు పరిశీలనగా చూడసాగింది. ఉబికివచ్చే కన్నీటిని సైతం తుడుచుకోకుండా, ఆ నీటిపొరల గుండా అతన్ని పరిశీలిస్తోంది. ఈసారి ఆ కళ్ళలో ఆవేదన, జాలి........

అది చూచి అన్నా డతను —

"శారదాదేవీ! ఎందుకా కన్నీరు? ఎందుకలా చూస్తారు? మీరెలా చూచినా కనబడే రూపమిదే...." అన్నాడు బాధగా.

అతని మాటల్ని వినిపించుకున్నట్టు లేదామె. మరికొన్ని క్షణాలు మౌనంగా గడిపిన తర్వాత —

"నిజం చెప్పండి!....ఎవరు మీరు?"

రాఘవ చకితుడై చూశాడు ఆమె వంక. "ప్లీజ్....! ఇది అబద్ధం అని చెప్పండి .. నేను మన్మథనుకాను....రాఘవను. మన్మథ వేరే వున్నాడు. వాడు నా కజిన్....అని చెప్పండి" అన్నట్టుగా అనిపించిందామె చూపు. ఆమె పరిస్థితికి జాలి కలిగిం దతనికి.

"శారదాదేవీ! మీ రచయిత కాదనుకున్నా నేను 'మన్మథ' కలం పేరుగా పెట్టుకున్న రాఘవరావునే.... మన్మథ ఎవరోకాదు — నా వునికి. నా అస్తిత్వం .... దేవుడిమీద కసికొద్దీ నేనే పెట్టుకున్నా నా పేరుని."

ఈసారి ఆమె ముఖంలో విరక్తి భావం గోచరించింది.

"హుం....దేవుడు!....దేవుడనే వాడుంటే మీ కిటువంటి రూపాన్నిచ్చేవాడుకాదు."

ఆ మాటతో మెరిసా యతని కళ్ళు. ఉత్సాహంగా ముందుకు వంగి —

"శారదా! ఏమన్నారు? దేవుడు లేడుకదూ! అతనేవుంటే ఈ రూపాన్ని నా కిచ్చేవాడుకాదు. అవునా?" అన్నాడు ఆ మాటను మరోసారి అనమన్నట్టుగా.

"ఏమో....వున్నాడనే అనుకున్నా నిన్నాళ్ళు. కాని మిమ్మల్ని చూస్తోంటే ఆ అభిప్రాయం సడలిపోతోందిప్పుడు. ఇంతటి సున్నితమైన హృదయానికి, ఉన్నతమైన భావాలకు, విజ్ఞాన సరస్వతికి రూపం ఇదేనంటే నమ్మటం ఎలా?.... ఎందుకింత ఘోరం జరిగింది?!...." దుఃఖపు టుప్పెన మళ్ళా చెలరేగిం దామెలో.

"శారదా! సరిగ్గా మా అమ్మ కూడా అలాగే అడిగేది భగవంతుడ్ని .... నిజానికి నా తండ్రి అదృష్టవంతుడు. నేను మూడు నెలలకు పుడతా ననగా కాలం చేశాడు. అప్పట్నుంచీ మా అమ్మే, చుట్టూవున్న మనుషుల పరిహాసాలమధ్యా, హేళన, ఏహ్యభావాలమధ్యా కుమిలిపోతూ పెంచింది నన్ను .... శారదా, నా మూలంగా నరకాన్నంతా ఆమె ఇక్కడే అనుభవించింది. ఆమె రక్షణలో, లోకానికీ, నాకూ మధ్య ఆమె కవచంగా, నేను హాయిగానే పెరిగాను. బయట ఎవరేమన్నా, ఇంటికివెళ్ళి, ఆ దయామయురాలు, ఆ మాతృమూర్తి లాలనలో, వోదార్పులో నేను అన్నీ మర్చిపోయేవాడివి. తీరిక సమయాల్లో అంటే శలవుల్లో నా కేమీ పని వుండేదికాదు. దిగాలుగా కూచునేవాడిని. నా దిగులును మరిపించడానికి మా అమ్మే ఏమైనా పుస్తకాలూ అవీ తెప్పించి చదువుకోమనేది. ఆమె చెప్పినట్టు చెయ్యటంవల్ల కొంత మనశ్శాంతి లభించేది. ఆ సమయంలోనే తెలుగులోను, ఆంగ్లంలోనూ ఎందరివో

మహా మహుల గ్రంథాలు చదివాను. అవి నన్నెంతో వుత్తేజ పరిచాయి. నిజానికి అప్పటినుంచే చిన్న చిన్న వ్యాసాలూ, కథలూ రాసేవాడిని .... ఇదంతా స్కూల్ ఫైనల్ తరువాత. అప్పటికి మీరు లేరు. ఆ వూళ్ళో మీ చదువు ఫోర్తుఫారంతోనే అయిపోయిందనుకుంటాను."

"అవును. నేను ఫోర్తుఫారం చదువుతూండగానే మా నాన్నగార్కి అక్కడ్నుంచి ట్రాన్స్ఫర్ అయిపోయింది. తరువాత ఏవేవో వూళ్ళు తిరిగి ఇక్కడ స్థిరపడి పోయాం. మా నాన్నగారు కూడా ఇక్కడ వుండగానే పోయారు."

"ఐసీ!..." జాలిగా తలపంకించాడు.

"అందుకే మీకు నా గురించి తెలియలేదు. మా అమ్మకూడా కొన్నాళ్ళకు పోయింది. నా డిగ్రీ చదువు సగంలో ఆగిపోయింది. అంతేకాదు. నాకీ లోకాన్నుంచి రక్షణ పోయింది. నాపైన నిరసన భావం....హేళన....వీటితో విసుగెత్తిపోయాను. ఆ తిరస్కారాలతో, హేళనలతో నా హృదయం ముక్కలు చెక్కలయింది. ఆ చీటల మధ్యనుంచి వచ్చిన కాలనాగులే నా రచనలు. వీళ్ళందరిలో నేనూ గొప్పవాడినే. వీళ్ళనుమించిన శక్తిసామర్థ్యాలు నాలోనూ వున్నాయి. ఆ ఆలోచనే, ఆ ఆవేశమే, తెలుగు దేశంలో కోట్లాది ప్రజలను వుత్తేజపరచిన సాహిత్యంగా రూపొందింది. మీ అందరి మధ్య నా రచనలకెంతో గుర్తింపు, ఆదరణ లభించింది. నాకు తెలియకుండానే నేనెంతో పెరిగిపోయాను. ఎన్నో సార్లు, నన్నవహేళన చేసిన వారందర్నీ నా గొప్పతనాన్ని చూపి నోరు మూయించాలనిపించేది. కాని ఈ కురూపితనం, నా వ్యక్తిత్వాన్ని మరుగుపరచినట్లే, నా సాహిత్యపు విలువల్ని కూడా రూపుమాపుతుందేమోనని భయం....అందుకే....అందుకే అజ్ఞాతంగా వుండిపోయాను. సంపాదకులద్వారా, ప్రచురణకర్తలద్వారా అందే వందలాది వుత్తరాలను, వాటిలోని ప్రశంసలను చూసుకుని మురిసిపోయేవాడిని. 'నేనూ మనిషినే....మామూలు మనిషిని గాదు. మహోన్నత వ్యక్తిని' అని వూరట చెందేవాడిని."

"వాటిల్లో నా వుత్తరాలు కూడా వుండేవి కదూ?"

అతను నిట్టూర్చాడు. "అవును. అవే నాలో ఆశల్ని పురి

కొల్పాయి మళ్ళీ. జీవితానికొక క్రొత్త అర్థాన్ని ప్రసాదించాయి. అన్ని ఉత్తరాలు వొక ఎత్తు, మీ ఉత్తరాలు వొక ఎత్తు."

"ఎందుకని?" కుతూహలంగా అడిగిందామె.

"వాటిల్లో....మీ వుత్తరాల్లో—నా కెవరో ఆప్తులు, ఆత్మీయులు కనబడేవారు. ఇంకా చెప్పాలంటే, గుండెల్లో దూరి గుసగుసలాడే గువ్వపిట్టల ప్రేమ సందేశాలు వినబడేవి....వాటిల్లోని ఒక్కొక్క అక్షరం అమృత బిందువై, నాలో అణువణువునా నవ చైతన్యాన్ని కలుగజేసింది. తిరుగుబాటు ధోరణిలో వున్న, నా రచనల్లో మార్పు రావటానికి అదే మొదలు...."

"అవును. ఆ మార్పును నేనూ కనిపెట్టాను. కాని, దానికి కారణం నేనేనని నాకు తెలీదు."

"అవును. మనకు తెలియకుండానే కొన్ని అద్భుతాలు మన చేతుల్లో జరిగిపోతాయి. మనమిద్దరం ఒకరికి వొకరు తెలియకుండానే ఒకరివల్ల వొకరు ప్రభావితులమైనాము. చేరువైనాం. తీరా మన మధ్యనున్న తెర తొలగేసరికి ఎదురుగా భయంకరమైన నిజం! నమ్మటానికి కూడా మనస్కరించని కఠోర సత్యం!.... అమృతంతోపాటు హాలాహలాన్ని కూడా అందుకోవలసి వచ్చిన మీ దయనీయ స్థితి. శారదా! ఎలావుందీ సన్నివేశం? నాకుతెలుసు, ఈ సన్నివేశాన్ని ఏదోవొక రోజున ఎదుర్కొనవలసి వస్తుందని. కాని, మీకు తెలీదు. అందుకే మీకీ వ్యధ. అయితే నేను మిమ్మల్ని బాధపెట్టను. అమృతంవంటి నా ప్రేమతోబాటు, హాలాహలంవంటి నా రూపాన్ని కూడా పరిగ్రహించమని నిర్బంధించను. కేవలం నా తృప్తికోసం, మీరు చేసే పని మనకు మేలు కన్నా కీడునే కలుగజేస్తుంది. జరిగిందంతా ఒక మధుర స్వప్నంగా నెమరు వేసుకుంటూ ఎదుటపడ్డ నిజాన్ని ఒక పీడకలగా భావించి, మరచి పోండి."

"అందువల్ల ఏం జరుగుతుంది!"

"నా ఆత్మతృప్తి—మీ ప్రేమను జన్మజన్మలకూ ఒక మధుర కావ్యంగా నా గుండెల్లో పదిలపరచుకుంటాను. నా సాహిత్య కృషికిది పరాకాష్ట. నా కలాన్ని విసర్జించి, ఆ కావ్య పఠనంతో జీవితమంతా ఏదో వొక మారు మూల ప్రదేశంలో గడిపివేస్తాను."

"మీరు చెప్పింది మీ మట్టుకు బాగానే వుంది. అది మీకు ఆత్మ తృప్తి కావచ్చు. కాని, నాకు ఆత్మ వినాశం రాఘవ గారూ! మనం దేన్నైనా జయించగలం. గానీ, ఆత్మను జయించలేం. మనస్సాక్షిని మరుగు పరచలేం. మిమ్మల్ని కేవలం, మీ రూపం కారణంగా పరిత్యజిస్తే, నిత్యం న్యాయా న్యాయాల మధ్య కొట్టు మిట్టాడే నా ఆత్మ మాటేమిటి? అది వూరుకుంటుందా? నన్ను ముద్దాయిగా బోను ఎక్కించదూ! అక్కడ దానికి నేనేం సమాధానం చెప్పాలి!"

"అయితే దేనికి బాధ? దేనికి మీ కన్నీరు?"

"చెప్పమంటారా?"

"చెప్పండి. ఇది నూరేళ్ళ పంట. ఇందులో మొహమాటాలూ, సంకోచాలూ పనికి రావు"

"అటువంటిదేమీ లేదు. పోతే, బాధ, గర్భంలో వుండగా తనకు పుట్టబోయే బిడ్డ మీద ఎన్నో ఆశలూ, మమతలూ పెంచుకున్న తల్లికి, తీరా పుట్టిన బిడ్డ కురూపి అయితే కల్గిన షాక్.. దానివల్ల కలిగిన బాధ, ఆవేదన ఇదే నన్ను బాధిస్తోంది. అలాగని బిడ్డను దూరం చేసుకోలేదు కదా? ఆ తల్లి... ఇప్పుడు తెలుసుకున్నారా? నేనెందుకు బాధ పడ్డానో?"

"శారదా! నువ్వు నువ్వు కేవలం ప్రేమైక మూర్తివి! మా అమ్మను మరపిస్తున్నావ్! ఇన్నాళ్ళకు, ఇన్నాళ్ళకు చనిపోయిన మా అమ్మే దిగివచ్చిందా అనిపిస్తుంది శారదా! ఎలా చెప్పను? ఎలా చెప్పను శారదా! నాలో చెలరేగే కృతజ్ఞతా భావాన్ని ఆనంద తరంగాల్లో ఉవ్వెత్తున లేచిపడే నా హృదయ నౌక...." ముప్పిరిగొన్న ఆనందంతో ఆ వాక్యాన్ని పూర్తిచెయ్య లేకపోయాడు.

అతని చేతిలో నలిగిపోతున్న తన చేతిని తీసుకునే ప్రయత్నం ఏమీ చెయ్యలేదామె.

"కాఫీ తెస్తాను" అంటూ మృదువుగా అతని చేయి విడిపించుకుని లోనికెళ్ళింది శారద. అతను సోఫాలో కూలబడ్డాడు.

"అమ్మా! నువ్వు ప్రక్కకు తప్పుకో, నేను చేస్తా కాఫీని" అంది శారద, వెనకనించే వెళ్ళి, తల్లి చేతిలో బ్రూ సీసాలను లాక్కుంటూ.

ఈ హఠాత్సంఘటనకు తృళ్ళిపడి, తెల్లబోయింది సుభ
ద్రమ్మ. శారద తరచుగా వంటింట్లోకి రాదు. వచ్చినా పెట్టిందేదో తినేసి వెళ్ళిపోతుంది. అటువంటిదీ రోజు తనే స్వయంగా వచ్చి చేస్తాననే సరికి ఆశ్చర్య పోయింది.

"అదేమిటమ్మా! ఇవాళ అటువంటి బుద్ధి పుట్టింది? నేనైనా వంట మనిషి రాలేదని చేస్తున్నాను. నువ్వెళ్ళి పని చూసుకో." అంది తల్లి వారిస్తూ.

"లేదమ్మా! నేనే చెయ్యాలి, ఆయన వచ్చారు" అంది శారద.

"ఆయ నెవరే!" అందావిడ కూతురి కళ్ళలోని కాంతిని పరిశీలనగా చూస్తూ.

"ఆయనే నమ్మా! మన్మథ గారు...."

"మన్మథా! ఓహో! ఆయన? పుస్తకాలు రాస్తారు?"

"అవునమ్మా! ఆయనే నన్ను వెతుక్కుంటూ వచ్చారు" అంది గొప్పగా.

"వెదకబోయిన తీగ కాలికి తగిలిందా? లేక తీగే విన్ను వెదుక్కుంటూ వచ్చిందా?"

"ఏదో వాహటిలే" అంది శారద అందంగా విసుక్కుంటూ.

"ఇంతకీ ఆయన పుస్తకాలకోసం రాక్ ప్రత్యేకంగా చేయించేవు కదా? ఇప్పుడాయన్ను ఎక్కడ కూచోబెట్టావమ్మా?" అందావిడ కూతురి వంక పరిహాసంగా చూస్తూ.

కాని ఆమెకేం తెలుసు? తన కూతురు అతన్నెక్కడ ప్రతిష్ఠింప జేసుకుందో...

తల్లికి మన్మథను పరిచయం చేసింది శారద.

అతన్ని చూస్తూనే కొయ్యబారి పోయిందామె. మళ్ళా అంతలోనే సర్దుకుంది సభ్యత కోసం.

"వీరేనమ్మా! రచయిత మన్మథ గారు..." అంది, శారద తల్లి ముఖంలో కలిగే మార్పుని గమనిస్తూ.

రాఘవ లేచి, వినయంగా నమస్కరించాడు.

తర్వాత "మా అమ్మ" తల్లిని అతనికి పరిచయం చేసింది.

తర్వాత ముగ్గురూ, ఎదురెదురుగా సోఫాల్లో కూర్చున్నారు.

కుశల ప్రశ్నలూ, కుటుంబ వివరాలకు మించి వాళ్ళ సంభాషణ సాగలేదు. కాస్సేపు కూచుని వెళ్ళిపోయాడు రాఘవరావు.

* * *

ఆ రాత్రి తల్లి వుద్దేశ మేమిటో తెలుసుకుందామని తమ విషయాన్ని కదిపింది శారద. ఒక్కసారిగా చెబితే ఆమె షాక్ తింటుందని ముందుగా అతని గుణగణాలూ అవీ వర్ణించి, అసలు విషయాన్ని నెమ్మదిగా చెప్పింది.

అయినా సుభద్రమ్మ షాక్ తిననే తింది. కూతురు ముఖం లోకి వెర్రిగా చూస్తూ—

"ఏమిటీ? నీకేమైనా మతి పోయిందా?...దొరకక్క దొరకక్క ఇతనా నీకు దొరికాడు ?!" అంది...

"ఇందులో రూపానికి నేను ప్రాముఖ్యత నీయలేదమ్మా! అతని హృదయానికి, అతనిలో గల కవితా శక్తికి, అతని వున్నతమైన వ్యక్తిత్వానికి, వీటికి నేను ప్రాముఖ్యత నిచ్చాను" అంది శారద.

"పిచ్చిపిల్లా! ఇది ప్రేమ అనిపించుకోదమ్మా! వ్యామోహం. నీ కన్న తల్లిగానే కాదు, వయసులో పెద్దదాన్నిగాకూడా చెబుతున్నాను. ఈ శక్తులూ, వ్యక్తిత్వాలూ నిలకడగా వుండవు. పరిస్థితుల ప్రభావానికి ఎటువంటి వ్యక్తి అయినా లొంగిపోక తప్పదు. అప్పుడు విచారించవలసి వుంటుంది.బాగా ఆలోచించుకో"

"బాగా ఆలోచించుకునే ఈ నిర్ణయానికి వచ్చానమ్మా!... నువ్వు చెప్పిన పరిస్థితు లేర్పడకుండా సాధ్యమైనంత వరకూ ప్రయత్నిస్తాను. అయినా అటువంటి పరిస్థితు లేర్పడతాయని ఎందు కనుకుంటున్నావ్? ఆయన అలాంటి చంచల మనస్కులు కారు."

"పిచ్చిదానా! నేను కేవలం అతని గురించే అనలేదమ్మా! పొరపాటెప్పుడూ అతని వల్లనే జరగక నీవల్లకూడా జరగవచ్చు"

"నా వల్లనా?" ఆశ్చర్య పోయింది శారద.

"అవునమ్మా! ఆరాధన వేరు. ప్రేమ వేరు, బాహ్య సౌందర్యానికి నువ్వెంత విలువ నివ్వక పోయినా, మీ ప్రేమ నిలవ

డానికి అది కూడా వుండాలమ్మా!"

"కలసిన మనసుల ముందు ఇవేవీ నిలవ్వు.."

"చెప్పటం అంత సులభం కాదు చెయ్యటం.... ఇంతకన్నా, రెండో పెళ్ళి వాడైనా మీ మామయ్య కొడుకు సుందరం నయం. వాడికి నీ మీద చాలా ఆశ వుంది. మీ నాన్న మూర్ఖతవల్ల నిన్ను చేపట్టవలసిన వాడు ఇంకొకర్ని చేసుకోవలసి వచ్చింది. పాపం! వాడి దురదృష్టం! రెండేళ్ళయినా కాపురం చెయ్యకుండానే అది కాస్తా తనువు చాలించుకుని వెళ్ళిపోయింది. ఇంతకీ ఎవరు ఎవరికి ప్రాప్తమో ఏం చెప్పగలం?"

"క్షమించమ్మా! బావ మీద నాకు ఆ వుద్దేశం లేదు. అదే కనక వుంటే నాన్న కాదు. ఎవ రడ్డు వచ్చినా, బావ నింకొకరికి దక్కనిచ్చేదాన్ని కాదు. పోనీ, ఇప్పుడు నాన్నలేరు కదా, చేసుకో దలచుకుంటే బావని చేసుకోవచ్చును కదా!"

"అయితే, నీ నిర్ణయం మారదా?" కాస్త తీవ్రంగానే అడిగింది సుభద్రమ్మ, కూతుర్ని.

కూతురు అంతకన్నా నిశ్చయంగా చెప్పింది. "లేదమ్మా! మార్చుకోలేను. మార్చుకుని నన్నూ, అతన్నీ కూడా నాశనం చేసుకోలేను."

నాశనం అన్న మాట చెవిని పడగానే మెత్తబడి పోయింది సుభద్రమ్మ.

"వద్దు తల్లీ! అంత మాటనకు. ఏదో తల్లిని కాబట్టి చెప్పాను. నువ్వు సుఖంగా వుండడమే నాక్కావలసింది. అయితే తరువాత నువ్వు పశ్చాత్తాప పడుతుంటే నేను చూసి బాధపడవలసి వస్తుందని ఇంతగా చెప్పాను" అంటూ అయిష్టంగా అటు తిరిగిపడుకుందావిడ.

"లేదమ్మా! నీ కూతు రెప్పుడూ పశ్చాత్తాపం చెందే పని చేయదు. అది షూర్!" అంది శారద. అటు తిరిగి పడుకున్న తల్లితో.

సుభద్రమ్మ దీనికేమీ మాట్లాడలేదు.

* * *

అంతకు ముందు వచ్చినప్పుడు రాఘవ ఇచ్చిన అడ్రసు ప్రకారం అతని ఇంటిని వెదుక్కుంటూ కారు వేసుకుని బయలు

దేరింది శారద. నిజానికి రాఘవే ఆ రోజు వచ్చి ఆమెను తన ఇంటికి తీసుకు వెడతావన్నాడు. కాని, అతన్ని సర్‌ప్రైజ్ చేద్దామని శారదే ముందు బయలుదేరింది. బయలుదేరిన పావుగంట కల్లా చేరుకుంది.

అది అప్‌స్టెయిర్ గల చిన్న యిల్లు. క్రింది భాగంలో హౌస్ ఓనర్ వుంటున్నట్టున్నారు. ఆరుబయట కూచుని పేపర్ చదువుకుంటున్న అతన్ని అడిగి, రాఘవ మేడపై వున్నాడని తెలుసుకుని మేడ మీదికి వెళ్ళింది శారద.

అది చిన్న రూం....దానికి ముందొక వరండా, వెనుకనొక వరండా, తరువాత కొంత డాబా వుంది. అయితే బాత్ రూమ్‌కీ వాటికీ క్రిందికి దిగాలి. అందుకు వెనుకనుంచి కూడా పెరట్లోకి మెట్లున్నాయి. గది కూడా వున్నంతలో బాగుంది. ఒక కిటికీ వారగా కాంప్‌కాట్. దానికి ప్రక్కగా మరి కొంత దూరంలోనున్న కిటికీకి దగ్గరగా ఒక టేబులు, కుర్చీ- అవి గాక వేరొక పడక కుర్చీ వున్నాయి. ఇంకొక మూలగా కూజా, దాని మీద గ్లాసు వున్నాయి. ప్రక్కనే స్టవ్, కొన్ని వంట పాత్రలు వున్నాయి.

శారద వెళ్ళేసరికి రాఘవ అటు తిరిగి రాసుకుంటున్నాడు. ఈ లోకంతో నిమిత్తం లేకుండా ఏవేవో వూహాలోకాల్లో తేలిపోతు న్నాడు. చేతిలోని కలం ఆ వూహల్ని కాగితంమీద పెడుతోంది.

శారద వెళ్ళి అతని వెనగ్గా నుంచుంది.

అతను గుర్తించలేదు.

ఆమె వంగి, వెనుకనుంచి అతను రాస్తున్న కాగితంలోకి తొంగి చూసింది. ఏదో కవిత. అర్థంకాని అక్షరాల్లో అక్కడక్కడ కొట్టివేతలతో నిండివుంది. ఆమె అలా చూస్తున్నంతలో, అతను ఆలోచిస్తూ, హఠాత్తుగా చేతులు విరుచుకుని వెనక్కు వ్రాలాడు. అలా వ్రాలటంలో అనుకోకుండా అతని చేతులు వెనుక నున్న శారద వక్షస్థలంపై పడ్డాయి.

ఇద్దరూ తృళ్ళిపడ్డారు. విద్యుద్ఘాతం తగిలినట్లుగా వణికిపోయారు.

రాఘవ చటుక్కున వెనక్కు తిరిగి -

"శారదా!!" అన్నాడు. అనుకోకుండా ఆమెను చూచిన సంభ్రమంతో, కుర్చీలోంచి లేచి నుంచుని.

హఠాత్తుగా వెళ్లి అతన్ని ఆశ్చర్యంలో ముంచివేద్దామనుకున్న శారదకూడా ఈ హఠాత్తు సంఘటనతో తత్తరపడి "అవును, నేనే" అంది సిగ్గుతో అతనివైపు చూచీ, చూడకుండా...

"సారీ! ఏదో పరాకులో పొరబాటు జరిగిపోయింది లాయరుగారు కోపం తెచ్చుకోకండి." అన్నాడు చేతులు రెండూ జోడించి వినయం నటిస్తూ.

అతని అతి వినయం చూచి, లాయర్ గారికి నవ్వు వచ్చింది. దానితోబాటు కోపం కూడా వచ్చింది.

"ఇంత అతి వినయం చూపించినవారిని లాయరుగారు క్షమించరు" అంది పెదిమలచాటున నవ్వును బిగించి.

"చిత్తం!....ధూర్త లక్షణాన్ని క్షమిస్తారా లాయర్ గారు?" అన్నాడు, మరింత వినయం వొలకబోస్తూ....

ఆమె ఫకాల్న నవ్వి-దీసారి

అతను నెమ్మదిగా ఆమెవద్దకు నడిచి వెళ్లి రెండు చేతుల్తో ఆమె ముఖాన్నెత్తి పట్టుకుని తనవైపు త్రిప్పుకుంటూ,

"శారదా! నా సంగతేమో గాని, నువ్వే నా దేవతవు" అన్నాడు.

ఆ సమయంలో ఆమెకు అతని 'చింపాంజీ' ముఖం కనబడలేదు. చీకి కళ్లు అసలే లేవు. ఆమెకు కనిపించిందల్లా ప్రేమతో, ఆరాధనతో వెలిగిపోయే రెండు కాంతిపుంజాలు!....వాటిల్లోనుంచి జాలువారే చల్లని వెన్నెల కాంతులు ...."

ఆమె మాట్లాడలేదు....మౌనంగా ఆమెను దగ్గరకు తీసుకుని గుండెల కదుముకుంటూ తన కృతజ్ఞతను చెప్పుకున్నాడు.

కొన్ని క్షణాలు ఆమె కూడా ఆ తన్మయావస్థలో గడిపింది.

కొన్ని క్షణాలు గడచినతరువాత ఆమె గభాలున అతని కౌగిలినుండి విడిపించుకుని ఇవతలకు జరిగింది.

"నిన్న మనగురించి మా అమ్మతో చెప్పాను." అంది మెల్లగా.

"ఏమని?"

తనకూ తల్లికి జరిగిన సంభాషణను వివరంగా చెప్పింది.

అది విని చిన్నబోయిందతని ముఖం....

"దాన్నిగురించి మీరేం బాధపడకండి....అది ఎలాగూ మనం అనుకున్నదేగదా, ..." అంది.

"లేదు శారదా! ఆమె మనసును కష్టపెట్టి మనం సుఖపడ గలమా అని...." అన్నాడు రాఘవ....కాస్సేపుండి. తరువాత, "పోనీ మీ సుందరం బావనే చేసుకోకూడదూ?" అన్నాడు మళ్ళీ....

ఆ మాటకు ఛర్రున లేచిందామె, కోపంతో—

"మీ సలహాకు చాలా థాంక్స్....చూడండీ! నేను లాయర్ని ....సలహా లివ్వవలసింది నేను గాని, మీరుకాదు" అంది కోపంతో ముక్కుపుటా లెగరవేస్తూ.

"దానికేం....ఫీజు లడక్కుండా ఎన్ని సలహాలనైనా ఇవ్వ వచ్చును." అన్నాడు రాఘవ నవ్వుతూ.

* * *

మూడు రోజులు పోయినతరువాత సుభద్రమ్మ ఆఖరి ప్రయత్నంగా వాళ్ళ స్వగ్రామంలో వున్న తన అన్నగార్ని, మేనల్లుడ్ని రప్పించింది.

వారితో జరిగిందంతా చెప్పి, శారద మనసు నెలాగైనా అతన్నుండి తప్పించమని ప్రాధేయపడుతూ బతిమాలుకుంది.

అయితే మనిషి ఎప్పుడు, ఏ పని, ఎందుకు చేస్తాడో ఎవరికీ తెలియదు. దానికి శారద ఒక ఉదాహరణ. అయితే సుందరం యింకొక ఉదాహరణ. అంతా విని ఇది జరిగే పని కాదని తేల్చి పారేశాడు, సుందరం. పైపెచ్చు తల్లీ తండ్రీ మొత్తుకున్నా వినక తనే శారదకు వత్తాసు యిచ్చి దగ్గరుండి వారి వివాహం చేయించటానికి నిశ్చయించాడు. అతనిలో వచ్చిన మార్పుకి శారదకూడా ఆశ్చర్యపోయింది. చివరికి పెళ్ళి తిరపతిలో అని నిశ్చయమైంది.

శారద తరఫున తల్లీ, మేనమామ రామయ్యా, బావ సుందరం కాక, గుమాస్తా శఠగోపం, వంటామె, నలుగురైదుగురు పనివారు; రాఘవ తరఫున ముకుందాపురం గ్రామస్థులు నరసయ్య, పెద్దన్న వారి కుటుంబ సభ్యులూ పెళ్ళికి బయలుదేరారు. ఆ రెండు కుటుం

బాలతోనే అతనికి వారి స్వగ్రామంలో ఎక్కువ సన్నిహితత్వంవుంది. పైగా నరసయ్యతో కొంత దూరపు బంధుత్వం కూడా వుంది. వీరందరూ కలసి ట్రైన్‌లో ఒక కంపార్ట్‌మెంట్ రిజర్వు చేసుకుని, తిరుపతికి బయలుదేరారు.

ఎంతో అట్టహాసంగా బయలుదేరవలసిన ఈ పెళ్లిప్రయాణం ఇంత తక్కువ మందితో నిరాడంబరంగా సాగిపోవటం సుభద్రమ్మ గుండెల్ని పిండివేస్తున్నా, కూతురు ముఖం చూచి ఆ బాధను లోలోపలా దిగమ్రింగుతుంది.

దారిలో రాఘవ అడిగాడు "ఏం శారదా! మీ బంధువులందరూ నేరుగా అక్కడికే వచ్చేస్తారా?" అని.

"రావచ్చు—"అంది శారద, పరిగెడుతున్న ప్రకృతిని కిటికీగుండా చూస్తూ. ఆ సమయంలో అతని ముఖంలోకి చూచి ఆ మాట అనే ధైర్యం లేకపోయిందామెకు.

ఏడుకొండలవాని సన్నిధిలో వారి వివాహం నిరాడంబరంగా జరిగిపోయింది.ఆరోజునే, తనకు జ్ఞానం వచ్చినతరువాత తొలిసారిగా దేముడికి రెండు చేతులూ జోడించి నమస్కారం పెట్టాడు రాఘవ. శారదను తనకు ప్రసాదించి, బ్రతుకులో క్రొత్త మలుపులు చూపినందుకు భగవంతునిపట్ల హృదయమంతా కృతజ్ఞతాభావం నిండిపోయిందతనికి.

అయితే ఒక్క విషయంమాత్రం అతనికి అంతుబట్టకుండా పోయింది. తమతో బయలుదేరిన వాళ్లు తప్ప, శారద బంధువులెవరూ రాలేదు పెళ్ళికి. వచ్చినవాళ్లైనా పైపై మర్యాదలు చూపుతున్నారేకాని అంతర్గతంగా దిగులుపడిపోతున్నట్టున్నారు. ఆ దిగులుకు అర్థమేమిటో అతనికి తెలిసినా, బంధువులెవరూ రాకపోవటానికి కారణం మాత్రం తెలియలేదతనికి.

అయితే దానిక్కారణం తిరుగుప్రయాణంలో సుందరం చెప్పాడు. అతను చెప్పినదాంట్లో శారద అభిప్రాయం కాక, సుభద్రమ్మ అభిప్రాయం ప్రతిబింబించడంతో చివుక్కుమంది రాఘవ హృదయం. అయితే దాన్ని మనసులోనే దాచుకుని ఇంటికి తిరిగివచ్చాక ఆనాటిరాత్రి ఏర్పాటైన తమ తొలి సమాగమంలో మెల్లగా గలిపాడు శారదతో....

"చెప్పు, శారదా! ఎందుకని ఎవరూ రాలేదు? ఎందుకు వాళ్ళు వచ్చే అవకాశం లేకుండా చేశారు? అందుకనేనా?" అడిగాడు గొంతులో బాధనూ, కళ్ళలో జాలినీ నింపుకొని.

కాస్సేపటివరకూ మాట్లాడలేకపోయిందామె. మౌనంగా వుండిపోయింది, దాన్ని ఆధారంగా చేసుకుని మళ్ళీ అతనే అన్నాడు,

"నాకు తెలుసు శారదా! పెళ్ళికివచ్చిన వారందరూ మనల్ని చూసి పరిహసిస్తారు. అది మీ కందరికీ బాధాకరంగా, చిన్నతనంగా వుంటుంది. అందుకనే ఎవరినీ పిలవలేదు కదూ?"

ఈసారి శారద నోరు మెదిపింది.

"కారణం అదే కావచ్చు. పడే బాధకూడా మావాళ్ళకే గాని, నాకేమీ వుండదు. ఇక ముందు వుండబోదు కూడాను. అయితే— వారి అపహాస్యాలు ఎక్కడ మీచెవుల బడతాయోనని, పడి మీరెంత బాధ పడతారోనని ఆలోచించే నేనీ పద్ధతికి వప్పుకున్నాను. అంతకు తప్ప మరేం లేదు." అంటూ అతనికి దగ్గరగా వెళ్ళి, రెండుచేతులూ అతని గుండెలపై వేసి నిమురుతూ— తలెత్తి అతని కళ్ళలోకి ఆర్ద్రంగా, జాలిగా చూసింది.

"ఒక్కటి మాత్రం గుర్తుంచుకోండి — మిమ్మల్ని కట్టుకున్నందుకు ఈ నాడేకాదు, ఏ నాడూ నేను బాధపడే మానసిక పరివర్తనకు లోనుగాను. పోతే మీరు అందరి మాటలూ విని బాధ పడి మనసు పాడుచేసు కోవద్దు. మనం జీవిస్తున్నది అందరి కోసం కాదు.... మనకోసం!.... తెలిసిందా?"

ఆ మాటలతో అతని కళ్ళముందు మబ్బుతెరలు విడి పోయాయి.

తన్మయంగా అతని గుండెల్లో ముఖం దాచుకున్న ఆమె నుదుటిపై రెండు వెచ్చని నీటి బిందువులు పడగానే చటుక్కున తలఎత్తి చూసింది— అతని కళ్ళు సంతత ధారగా వర్షిస్తున్నాయి.

"ఛ!.... ఏమిటీ పిచ్చి?".... అంది చెయ్యెత్తి ఎగుడు దిగుడు గానున్న అతని చెక్కిళ్ళ మీదుగా కారుతున్న కన్నీటిని తుడుస్తూ.

అతను ఆనందాతిరేకంతో నిలువునా వణికి పోతున్నాడు.

తెల తెల్లవారుతుండగా శారదకు మెలకువ వచ్చింది. రాఘవ గుండెల్లో తలదాచుకుని పడుకున్న ఆమె "ఏమండీ!" అని పిలిచింది— తలఎత్తి భర్త ముఖంలోకి చూడబోతూ—

అయితే రాఘవ ఆమె ప్రయత్నాన్ని కొనసాగనివ్వలేదు.

శారద ముఖాన్ని మరింతగా తన గుండెల్లోకి అదుము కుంటూ—

"ప్లీజ్! శారదా! కాస్సేపు అలాగే వుండు...."

"చాల్చాలు.... ఇంకా సరిగ్గా తెల్లవార లేదు. .... నన్ను వదలండి పోతాను...."

"అప్పుడే? .... మరి కాస్సేపు...." మరింత దగ్గరగా లాక్కున్నాడామెను.

"బాగుంది.... అప్పుడే అవతల లేచి పోయారందరూ.... ఎవరైనా వచ్చి తలుపు కూడా కొడతారు." అందామె విడిపించు కుందికి ప్రయత్నిస్తూ....

"ఎవరు? నీ క్లైంట్సా?"

ఆమెకు కోపం వచ్చింది — "బాగుంది, మీ జోకు...." అంటూ అతని కౌగిలినుండి బలవంతంగా విడిపించుకుని బైట పడింది.

కాని, అతను మాత్రం ఆమెకు తన ముఖాన్ని చూసే అవకాశం ఇవ్వలేదు. గభాలునముఖం మీదికిదుప్పటి లాగేసుకున్నాడు.

అతని చర్యచూసి ఆమెకునవ్వూ, కోపమూ కూడావచ్చేయి.

"హుఁ.... మహా గొప్ప...." అంది.

"ఇంతోటి ముఖం చూస్తానని ...." అతను పూర్తి చేశాడు దుప్పటిలో నుండే....

"సరే.... అలాగే పడుకుని మాట్లాడుతూ వుండండి....వేడి వేడి కాఫీ తెచ్చి చురక వేస్తాను ..." అంటూ ఆమె చరచరా ఆ గదిలోంచి వెళ్ళిపోయింది.

* * *

ఆ వుదయం పది గంటలప్పుడు రాఘవ తరఫున ముకుంద పురంనుంచి వచ్చిన నరసయ్య, పెద్దన్న వెళ్ళిపోతూ లైబ్రరీ రూంలో కూర్చున్న రాఘవ వద్దకు వచ్చారు.

"మేం వెళ్ళొస్తామయ్యా! రాఘవయ్యా!" అన్నాడు నరసయ్య....

"అప్పుడే వెడతారా?" అన్నాడు— రాఘవ లేస్తూ.

"అవును బాబూ వెళ్ళాలి. అక్కడ మా ప్రయత్నాలు మేం చేసుకోవద్దూ?" అన్నాడు పెద్దన్న.

"ప్రయత్నాలేమిటి?" అన్నాడు రాఘవ.

"బాగుంది.... అమ్మాయిని ఇంటికి తీసుకురావా?" అంది నరసయ్య భార్య...

అప్పుడే అక్కడకు వచ్చిన శారద కూడా విందా మాటను.

"ఏవమ్మా! నువ్వూ, అబ్బాయీ, మీ అమ్మగారూ అందరూ కలిసిరండి. మా వూరికి—" అందావిడ శారదనుద్దేసించి...

" మీ అమ్మగారితో కూడా చెప్పాం... సరే నన్నారు..." అన్నాడు నరసయ్య....

"తప్పకుండా వస్తామండీ!.... కాస్త ఈ హడావిడి అంతా తగ్గాక నాలుగైదు రోజుల్లో వస్తాం...?" అంది శారద వినయంగా...

"అయితే, మా కోసం మీరే ప్రయత్నాలూ చెయ్యకండీ.... కొంచెం ఇల్లు శుభ్రం చేయిస్తే చాలు...." అన్నాడు రాఘవ....

"భలే వాడవే.... మీ యింటికి నువ్వెళ్ళడానికి మా ప్రయత్నం ఏమిటి?... అమ్మాయిని తీసుకుని మొట్టమొదట మా ఇంటికే రావాలి..." అంది నరసయ్య భార్య మళ్ళీ....

"మంచి పోకయ్యోవ్! రాఘవయ్యా! మా ఇంట్లోకూడా ఒక పూట వుండాలి మీరు.... ఏవమ్మా?" అన్నాడు పెద్దన్న, వెడుతూ వెడుతూ....

వాళ్ళటు గుమ్మం దాటగానే శారద, రాఘవకేసి తిరిగి—

"వాళ్ళని పంపివేసి ఇప్పుడే వస్తాను." అంటూ బయటకి నడిచింది శారద.

ఆమె వెళ్ళిపోయాక రాఘవ మళ్ళీ పుస్తక పఠనంలో మునిగి పోయాడు.

ఇంతలో బైట వరండాలో ఎవరివో మాటలు వినిపించాయి.

ఒకావిడ ఎవరో సుభద్రమ్మని అడుగుతోంది—

"ఏవమ్మా! మీ అల్లుడిగారి తరఫున వచ్చిన బంధువులందరూ

వెళ్ళిపోయినక్లైనా?"

రాఘవ చటుక్కున పుస్తకం మూసివేశాడు.

సుభద్రమ్మ చెబుతోంది.—

"ఆఁ ... వెళ్ళారమ్మా! బంధువులు ... మా పాలేర్లు నయం...."

ఆవిడ ఎంత నెమ్మదిగా అన్నా ఆమాట రాఘవ చెవిన పడనే పడింది.

"అయినా మీ శారద చాలా తొందర పడిందమ్మా! వో అందమా? అంతస్థా? ఏం చూసుకుని వరించిందతన్ని?" అవతలి మనిషి ఈసడింపు....

"ఏంటోనమ్మా! ఈ కాలపు పిల్లలు, చెబితే వినరు. పైగా అది స్వతంత్రురాలు... పట్టుదల మనిషి... వద్దంటే కాస్తా లేవ దీసుకుపోతుందేమో... ఆ అప్రదిష్ట కూడా ఎందుకని వొప్పుకో వలసి వచ్చింది."

రాఘవ కళ్ళముందు మరో తెర తొలగి పోయింది. తను, శారదకు అందంలోనేకాదు, అంతస్థులో కూడా సరి తూగడు...

"ఏమండీ! ఎందుకలా వున్నారు? ఏమయింది??" అంది శారద లోనికి వస్తూ.

అతనామెకు సమాధానం చెప్పలేదు. నేరుగా ఆమె దగ్గరకు వెళ్ళి ఆమె మెడలో మెరిసిపోతున్న వజ్రాల హారాన్ని చూపుతూ—

"శారూ! దీని ఖరీదెంత?" అన్నాడు.

"ఇదా?— ఖచ్చితంగా తెలీదు— మా అమ్మది, కనీసం అయిదారు వేలుంటుంది. ఏం? ఎందుకు?...

"అబ్బే — ఏంలేదు. వూరికినే అడిగాను..."

"లేదు. ఏదో కారణం వుంది. మీరుదేన్ని గురించో బాధ పడుతున్నారు. చెప్పండి... మిమ్మల్ని ఎవరైనా ఏమైనా అన్నారా?" అంది. ఆమె అతనికి మరింతదగ్గరగా వెళ్ళి అనునయంగా గుండెలు నిమురుతూ.

"అబ్బే... నన్నెవరే మంటారు?... ఏం లేదు..."

"మరైతే ఎందుకలా వున్నారు?"

"..... ... ....."

"చెప్పండి...."

"శారదా! నేను చాలా తప్పు చేశానేమో ననిపిస్తోంది."

"ఏమిటి?"

"ఒక అందాల బొమ్మ, అపురూప సుందరి వలచి వచ్చిం దన్న సంబరంలో ఎన్నో ప్రాథమిక విషయాలను నిర్లక్ష్యం చేశాను."

"ఏమిటా ప్రాథమిక విషయాలు?"

"శారదా! నా ఆస్థిపాస్తుల గురించి నేనెప్పుడైనా చెప్పానా?"

"నేనెప్పుడైనా అడిగానా?" ఆమె అనునయంగానే అన్నా, అట్టడుగున బాధ మెలిదిరిగింది.

"నువ్వడక్క పోయినా చెప్పాల్సిన బాధ్యత నాకుంది."

"మీ బాధ్యత లేమిటో నాకు తెలియవు. నాకు కావల సింది, నేను కోరింది మీ హృదయం. దాని యొక్క విలువ తరగ నంతవరకూ మీరు ఎంత పేదవారైనా, నాకు ఫరవాలేదు."

"మరీ నిన్ను పోషించలేనంత పేదవాడినికాదు. అయితే నిన్ను అపురూపంగా చూసుకునేంతటి ఆస్థిలేదు. నిజానికి ఇటు వంటి హారం నీ కొకటి చేయించాలంటే నేనెంతో ప్రయత్నం చేయాల్సి వస్తుంది."

"నాకు మీరేమీ హారాలు చేయించ నక్కరలేదు. పోతే, మీకున్న దానినే వృద్ధిపరచుకుందాం."

"ఎలా?"

"ఎలానా?... మీరు రచయితలు. ఏడాదికి ఎన్నో గ్రంథాలు మీవి అచ్చవుతున్నాయ్. అవునా?"

"అవును."

"ఆ డబ్బంతా ఎవరో పబ్లిషర్స్ తినే బదులు మనమే స్వంతంగా ఒక పబ్లికేషన్ స్థాపించి అచ్చువేయిస్తే?"

"బాగానే వుంటుంది. కాని, పబ్లికేషన్ అంటే మాటలా? చాలా డబ్బు ఖర్చు. ముందు సరియైన ప్రెస్‌ను పట్టుకోవాలి. వాళ్ళడిగినప్పుడల్లా డబ్బుపారేస్తూ, వాళ్ళు మన కళ్ళ ఎదుటనే కాగితాల్ని అమ్ముకు పోతున్నా చూస్తూ వూరుకోవాలి."

"అవన్నీ ఎందుకు? మనమే ఒక ప్రెస్ కొనేస్తే?"

"బాగానే వుంటుంది. కాని అది వేలతో కూడిన పని...."

"ఖర్చుకు మీరు భయపడవద్దు...."

"మరి దేనికి భయపడమంటావ్ ?" నవ్వుతూ అడిగాడు.

"మీపై మీకుగల అవిశ్వాసానికి.... చూడండి !.... భయపడుతూ నడిస్తే దారినబోయే గొడ్డెకూడా పొడవ వస్తుంది. మీకు నేను నీతులు చెప్పవలసినదాన్ని కాదు."

"అవును, శారూ ! నీతులు చెప్పవలసిన దానివికాదు, ఆజ్ఞాపించవలసిన దానివి...."

"మరే...ఇప్పట్నుంచే పెళ్ళాన్నిలా అంటే నెత్తికెక్కి కూచుంటుంది..." అందామె నవ్వుతూ.

"అది మా అమ్మ అనవలసినమాట...."

"మీరేగదా అన్నారు; మీ అమ్మగారి బాధ్యతలుకూడా కొన్ని తీసుకోవాలి..."

దానికతడు నవ్వి—"బాగుంది. నువ్వే కోడలిగా, అత్తగారిగా ద్విపాత్రాభినయం చేస్తున్నావన్నమాట." అన్నాడు—"ఇంతకీ ఇది చెప్పు — ప్రెస్ కొనడానికి డబ్బెక్కడ్నుంచి వస్తుంది ?"

"మళ్ళీ మొదటికే వచ్చారు. ఖర్చుకు మీరు భయపడవద్దంటే అర్థమేమిటి ?"

"ధైర్యంగా ఖర్చుపెట్టమని..."

"అంతే....ధైర్యంగా ఖర్చుపెట్టండి.... ఎంతయినా నేనిస్తాను."

"నువ్వా ?!" ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏం ? ఎందుకంత ఆశ్చర్యం ?"

"లేదు శారదా ! ఆశ్చర్యం కాదు. నీ డబ్బుతో ఇవన్నీ చేయటం నాకిష్టం లేదు..."

"మరి ?...."

"మా వూళ్ళో మా పొలం, యిల్లూ వున్నాయిగా...."

"అవి అమ్ముతానంటారు ?"

"అమ్మితే మాత్రం !....ఇంకో విధంగా డబ్బు చేసుకుంటున్నాంగా...."

"ఇంకో విధంగా డబ్బు చేసుకుందికి వాటిని అమ్మటమేమిటి? దానికి బదులు ఇంకో విధంగా డబ్బు తెచ్చుకోవచ్చునుగా...."

"లేదు శారదా! ఎలా చూసినా నీ దగ్గరనుండి అంత డబ్బును తీసుకోవటం నా కిష్టంలేదు. పైగా అది పెరటిదారిని కట్నం తీసుకున్నట్టే అవుతుంది. అది నా ఆశయానికి విరుద్ధం...."

శారద కాస్సేపు ఆలోచించింది. ఎలాగైనా వాటిని అమ్మకూడా చెయ్యాలని "పోనీ, నా దగ్గర అప్పుగా తీసుకోండి...." అంది.

"అప్పు తీసుకోనా?" సంశయంగా అడిగాడు రాఘవ.

"అవును...."

"శారదా! ఒకవేళ, అది నేను తీర్చలేకపోతే?"

"మిమ్మల్ని జప్తు చేస్తాను...." అంది నవ్వుతూ.

అదే సమయానికి గోడగడియారం ఠంగున ఒక గంట కొట్టింది.

* * *

మరొక పదిరోజుల తరువాత ఒక మంచిరోజు చూచి, శారదా, రాఘవ ముకుందపురం బయల్దేరారు.

అయితే రాఘవ వూహించినట్టు ఆ వూరి ప్రజలు ఏమీ లేదుకాని, ఆశ్చర్యంతో వుక్కిరి బిక్కిరయిపోయారు. అనాకారి రాఘవయ్యకు ఒక అందాల బొమ్మతో పెళ్ళయిందని తెలుసుకుని, ఆవిడ మరీ ఇంత అందంగా వుంటుందనీ, మరీ కారుల్లో తిరిగేంతటి ధనవంతురాలనీ తెలియదు. అదే వారి ఆశ్చర్యానికి కారణం. వారిని మరీ ఆశ్చర్యంలో ముంచిన విషయమేమంటే శారద అతన్ని కోరి పెళ్ళాడిందని.

నరసయ్యగారింట్లో స్వాగతం ఘనంగానే లభించింది—ఆ నూతన దంపతులకు. పందిళ్ళతో, పచ్చతోరణాలతో పెళ్ళివారిల్లులా వుందది. మధ్యాహ్నం భోజనాలు వారింట్లో అయినాక రాత్రి భోజనాలు పెద్దన్న గారింట్లో జరిగాయి.

పదిరోజుల వ్యవధిలో నరసయ్య పెద్దన్న రాఘవ ఇంటికి పెంకు తిరగవేయించి వెల్లవేయించారు. చిన్న చిన్న మరమ్మత్తు లుంటే పూర్తిచేయించి ఆధునిక స్త్రీలకు కావలసిన సౌకర్యాలన్నీ

సమకూర్చారు. అది చిన్న యిల్లు. ముందు వసారా, రెండుగదులు, వెనుక వసారా, వంటిల్లు గల పెంకుటిల్లు. వెనుక కాస్త పెరడు, నుయ్యి వగైరాలు అన్నీ అక్కడే వున్నాయి.

ఆ రాత్రి—

కృష్ణ పక్షమి తదియనాటి చంద్రుడు. అప్పుడే బైటికి వస్తు న్నాడు—కొండ వెనుకనుంచి. కొండపై వేణుగోపాలస్వామి ఆల యం చంద్ర కిరణాల తొలి స్పర్శ ననుభవిస్తోంది. పెరట్లో నంది వర్ధనం చెట్టుక్రింద మంచం వేసింది శారద. చుట్టూ ప్రశాంతమైన వాతావరణం. ఈ అనంత విశ్వైకాంతతకీ క్రింద తామిద్దరూ, పైన ఆ తారాచంద్రులే వున్నట్టుగా భ్రమ కలిగించే వాతావరణం.

"ఇటువంటి ఏకాంతాన్ననుభవించి ఎన్నాళ్ళయిందో!...."

అన్నది శారద—మల్లెపువ్వులాంటి ప్రక్కమీద వ్రాలిపోతూ.

రాఘవ ఆమెకు అటోచెయ్యీ, ఇటోచెయ్యీ వేసి మంచం మీదనే కూచున్నాడు.

"శారదా! ఎప్పుడూ దిగులుతో బావురుమనే ఈ యింట్లో, ఈ జీవితంలో ఆలస్యమైనా ఈ నాటికి వెన్నెల వుదయిస్తోందంటే దీన్ని నమ్మటానికిప్పటికీ నాకు సాధ్యం కావటంలేదు."

చెయ్యెత్తి లాలనగా అతని చెక్కిళ్లు నిమురుతూ అంది శారద—

"అదంతా మీ భ్రమ...."

"నిజంగా శారదా! నాకిదంతా భ్రమలాగానే కనిపిస్తోంది. ఈ సుందర స్వప్నం ఎప్పుడైనా చెదరిపోతుందేమోనన్న భయం కూడా వేస్తోంది."

ఆమె మాట్లాడలేదు. అలానే తన్మయంగా చూస్తోందతని వేపు.

అతను మరింత ముందుకు వంగాడు ఆమెపైకి. ఆమెచేతిలో చెయ్యి బిగిస్తూ, ఆమె వక్షంలో తలదాచుకుంటూ అన్నాడు—

"శారదా! నిజంగా నాకు భయం వేస్తోంది. ఈ సుఖం, ఈ అనుభవం శాశ్వతం గావేమోనని. చెప్పు శారదా! ఒక్కసారి చెప్పు. ఎన్ని అవాంతరాలు వచ్చినా, మనమధ్య ఎన్ని విషనాగులు పరుగులెత్తినా ఈ చేయి వదలననీ, నన్ను ఈ స్థానం నుండి త్రోసి

వేయననీ...."

ఉబికివచ్చే అతని కన్నీళ్ళతో ఆమె వక్షం తడిసిపోయింది. ఆ నీరు గుండెల్లోంచి లోపలికికూడా ఇంకిందా అన్నట్టు ఆర్ద్రమైంది ఆమె హృదయం.

మెల్లగా తన రెండో చేతిని చుట్టూ బిగించి, మరింత దగ్గరగా అదుముకుందతన్ని తనలోకి.

*　　　*　　　*

ఆ సమ్మర్ వెకేషన్స్‌లో శారద, రాఘవ లిద్దరూ హనీమూన్ యాత్ర పెట్టుకున్నారు. యాత్రకు ముందు విజయవాడ, మద్రాసులలోగల పత్రికాధిపతుల్నీ, పబ్లిషర్సునీ వీలయితే అజ్ఞాతవాసంలో వుండగా రాఘవను పత్రికలద్వారా అప్రోచ్ చేసిన రెండు మూడు సినిమా కంపెనీలవారినీ కలుసుకోవాలను కున్నారు. అప్పట్లో సినిమా కంపెనీలవారి అభ్యర్థనను మన్నిస్తే వారితో ముఖాముఖీ మాట్లాడవలసి వస్తుందేమోననే వుద్దేశంతో రాఘవ వారి అభ్యర్థనకు ఏమీ సమాధానం చెప్పలేదు.

*　　　*　　　*

ఉదయం పదకొండు గంటలవేళ విజయవాడలోని ఒకపత్రికా కార్యాలయానికి వెళ్ళారు రాఘవ, శారద. ఆంధ్రదేశంలో బహుళ ప్రచారంగల పత్రిక అది. ఎంక్వయిరీ ఆఫీసులోకి వెళ్ళి రాఘవ తన విజిటింగ్ కార్డు ఇచ్చాడు - ఛీఫ్ ఎడిటర్‌కు పంపమని. అక్కడెవరో ఆంగ్లో ఇండియన్ అమ్మాయివుంది.

"పైన ఎడిటర్సు కాన్ఫరెన్సు జరుగుతోంది. ఒక గంట వరకూ వీలవదనుకుంటాను'' అందామె, రాఘవను, శారదనూ మార్చి మార్చి చూస్తూ.

''మీరిది పైకి పంపండి. వారు వెయిట్ చెయ్యమంటే అలాగే చేస్తాం" అన్నాడు రాఘవ.

ఆమె బాయ్‌ద్వారా దాన్ని పైకి పంపింది.

మరునిముషంలోనే రమ్మని కాల్ వచ్చింది, ఛీఫ్ ఎడిటర్ నుంచి.

కాన్ఫరెన్సు మధ్యలో సాధారణంగా ఎవరికీ ఇంటర్వ్యూలు ఇవ్వరు. వి. ఐ. పి. లకుగాని, ఛీఫ్ ఎడిటర్‌కు మరీ కావలసిన

వాళ్ళయితేనే ఆ సమయంలో ఇంటర్వ్యూ ఇస్తారు ఒక్కడ. అటు వంటిది ఈ చింపాంజీ ముఖానికి ఇంటర్వ్యూ వచ్చిందనగానే ఆశ్చర్యపోయిందామె. ఎడిటర్‌కు ఎవరో దగ్గర బంధువు లనుకుంది.

"బోయ్ వెంట పైకి వెళ్ళండి...." అంది సగౌరవంగా.

రాఘవ ఒక సారి శారదవంక మెరిసే కళ్ళతో గర్వంగా చూసి, ఆమెను తీసుకుని బోయ్ వెంట పైన ఛీఫ్ ఎడిటర్ రూంకి వెళ్ళాడు.

* * *

పైన చీఫ్ ఎడిటర్ ఆఫీసురూంలో విశాలమైన బల్ల చుట్టూ ఎడిటర్లూ, సబ్ ఎడిటర్లూ కలిసి పదిహేను మందిదాకా కూచుని వున్నారు. ఇన్నాళ్ళూ అజ్ఞాతంలోవుండి తమను వుత్కంఠలో ముంచివేసిన ఈ మన్మథ ఎవరా అని కాన్ఫరెన్సుని మధ్యలోనే వాయిదా వేసుకుని, స్వింగ్‌డోర్స్‌వంకే చూస్తున్నా రందరూ.

బాయ్ డోర్‌ను తెరచి పట్టుకోగా రాఘవ, శారదతోసహా లోనికి ప్రవేశించాడు.

రూంలోకి అడుగు పెడుతూనే ఎదురుగా రివాల్వింగ్ ఛైర్‌లో ప్రత్యేకంగా కూచునివున్న చీఫ్ ఎడిటర్‌ని గుర్తించి "అయాం మన్మథ, యువర్ రైటర్" అని తనను తాను పరిచయం చేసుకుని-తరువాత శారదను పరిచయం జేశాడు.

కాని, ఇతన్ని రిసీవ్ చేసుకునే స్థితిలో లేరువాళ్ళు. తమ ఎదురుగానున్న ఆకారం విఖ్యాత రచయిత మన్మథ దేనన్నా సత్యాన్ని నమ్మగలిగే స్థితిలో లేరు. ఇంకా ఆశ్చర్యం అతని ప్రక్కనున్న అందాల సుందరి అతని భార్య అవటం!....

అందరికన్నా ముందుగా చీఫ్ ఎడిటరే మేల్కొన్నాడు. కుర్చీలోంచిలేచి ముందుకువచ్చి మన్మథను షేక్‌హేండిస్తూ — "ఐయాం వెరీ గ్లాడ్ టు మీట్ యు! రండి! కూచోండి!" అన్నాడు, అక్కడనేవున్న రెండు కుర్చీలు చూపిస్తూ. ఆ దంపతు లిద్దరూ కుర్చీల్లో కూచునేలోగా మిగతావారు కూడా మేల్కొన్నారు

మన్మథను, శారదను ప్రేగంట చూస్తూ తమ తమ ఆసనాల్లో సర్దుకు కూచున్నారు.

ఆ తర్వాత చీఫ్ ఎడిటర్ అక్కడున్న ఎడిటర్స్ నందరినీ ఆ దంపతులకు పరిచయం చేశాడు.

పరిచయాలైన తర్వాత టీ అరేంజ్‌చేసి ప్రెస్ కాన్ఫరెన్సు ఏర్పాటు చేశారు — విలేఖరుల కెమెరాలు క్లిక్ మన్నాయి వారి మీద.

తరువాత అక్కడ వున్నవారందరూ అడిగిన ప్రశ్నల ద్వారా తన గురించీ, శారద గురించీ వారికి వివరంగా చెప్పాడు మన్మథ.

మన్మథ జీవిత చరిత్ర, శారద - మన్మథల ప్రేమాయణం, వారి వివాహం-అక్కడవున్న వారందరికీ ఏదో సినిమా కథలా తోచింది. శారద కూడా వారు తనను అడిగిన ప్రశ్నలకు సమయోచితంగా సమాధానాలు చెప్పింది. విఖ్యాత రచయిత మన్మథను పాఠక లోకానికి పరిచయంచేసే భాగ్యం మొట్టమొదటి సారిగా తమ పత్రికకే కలిగించినందుకు ఆ దంపతులకు అనేక విధాల ధన్యవాదాలర్పించాడు చీఫ్ ఎడిటర్.

ఆ కాన్ఫరెన్స్ తరువాత అందరి దగ్గరా శలవు తీసుకుని బైటపడ్డారు ఆ దంపతులు

మద్రాసులోని పత్రికా కార్యాలయాలూ, పబ్లిషింగ్ కంపెనీలు అయిపోయాక, ఆనాటి సాయంత్రం హోటల్‌కి రాగానే అన్నది శారద.

"మహాశయా! ఇంక ఫిలిం కంపెనీలు మిగిలి వున్నాయ్....."

"వద్దు శారదా! అవి రిటర్న్ జర్నీలో చూసుకుందాం. మనం రేపు రాత్రికే ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి" అన్నాడు రాఘవ.

"అదేం?" అన్నది శారద ఆశ్చర్యంగా.

"ఏమో! ఇంతకన్నా ముఖ్యమైన పని ఇంకొకటి మిగిలి వుంది".

"ఏమిటి!"

"ఇది...."అన్నాడు ఆమెను దగ్గరగా తీసుకుని పెదవులపై ముద్దిస్తూ.

"మనం వచ్చింది హనీమూన్‌కి—రేపు ఫుల్‌మూన్ డే.... రైల్లో ఒకటిక్కూపే రిజర్వుచేసుకుని, రాత్రంతా మూన్‌లైట్‌లో ప్రయాణంచేస్తూ, ఈ హనీని రుచిచూడాలని ఈ దీనుడి కోర్కె.... రాణీగారు అనుమతిస్తే అందుకుతగ్గ అరేంజిమెంట్సు చేస్తాం!...." అన్నాడు భక్తుడు వినయంగా.

"సరే....ఏదో స్పెషల్ కేసుగా అనుమతించాం" అన్నారు రాణీగారు ఠీవిగా, బాత్‌రూంలోకి నడిచిపోతూ.

* * *

మర్నాడు ఉదయం తొమ్మిది గంటలవేళ — మనిషినీ, మనిషినీ ముద్దెట్టుకుంటూ, తమ చల్లని ఆలింగనంలో వారిని ఉక్కిరి బిక్కిరిచేస్తూ, ఆ నీలగిరి పర్వత లోయల్లో పరుగులెడు తున్న మేఘమాలికల మధ్య దోబూచులాడుతున్నారు శారదా, రాఘవలు.

రాఘవ ఇదివరకు ఒకటి రెండుసార్లు అక్కడకు వచ్చాడు. అక్కడనే కొన్ని రోజులుండి ఎన్నో రచనలు సాగించాడు. నేడు ఆ ప్రదేశాలన్నీ శారదకు చూపుతున్నాడు. ఆ అనుభవం ఆమెకు వింతగానే వుంది.

తన తెల్లని చేతిని అతని నల్లని చేతితో పెనవేసి అలా తృళ్ళుతూ, గెంతుతూ నడుస్తున్న ఆమె హఠాత్తుగా అతని చేతిని వదలివేసింది.

"ఏమిటి శారదా! ఏమైంది?" అన్నా డతను ఆశ్చర్యంగా.

"అదుగో అటుచూడండి! అది మన కారులాగాలేదూ?"

వారికి కాస్త దూరంలో కారు పార్కింగ్ లోనికి ప్రవే శిస్తున్న లేతనీలంరంగు ఫియట్ కనబడింది.

"పదండి వెళదాం" అంది శారద ముందుకు నడుస్తూ.

వాళ్ళు రోడ్డుని క్రాస్‌చేసి పార్కింగ్ ముందుకు వెళ్ళేంతలో సుందరం కారుని పార్క్‌చేసి, ఇగ్నిషన్‌కీ జేబులో వేసుకొంటూ బయటకు వచ్చాడు, చేతిలో ఎయిర్ బాగ్‌తో.

"మా సుందరంబావ!" అంది ఆశ్చర్యంతో శారద.

వీళ్ళిద్దర్నీ చూడగానే సుందరం ఉలిక్కిపడి తిరిగి అంత లోనే సర్దుకుంటూ "హల్లో బ్రదర్! మీరేరోజే వచ్చేశారేం?...

ప్రోగ్రాం ప్రకారం మద్రాసులో రేపుబయలు దేరవలసింది కదూ? ఏం శారదా ! అంతేనా?" అన్నాడు శారదవంక తిరిగి.

"అంతేకాని...."అని ఏదో చెప్పబోయి, భర్తవంకచూసి, మళ్ళీ సర్దుకుని, "మేం వెళ్ళిన పనులయిపోయాయ్....మీ తమ్ముడు గారికి అక్కడ గొప్ప రిసెప్షన్ లభించింది బావా!" అంది, మెరుస్తున్న కళ్ళతో.

శారద కళ్ళల్లో మెరిసిన మెరుపులకు సుందరం గుండెల్లో వురుములు వురిమాయి. అయినా ఎంతో కష్టంమీద నిగ్రహించుకుని,

"ఐసీ !....కంగ్రాట్సు బ్రదర్?" అంటూ చేతిని ముందుకు చాపాడు.

రాఘవ థాంక్స్, చెప్పి చేతిని అందుకుంటూ "సరేగాని, ఏమిటిలా బయల్దేరారు ?" అన్నాడు.

"సారీ! చెప్పటం మర్చిపోయాను. అర్జంటుగా వచ్చి కల్సుకోమని కోయంబత్తూరు నుంచి మా ఫ్రెండు లెటరు వ్రాశాడు. అప్పటికి బయలుదేర వలసిన ట్రైన్స్ ఏమీలేవు. సరే, ఈ కారు ఎలాగూ ఐడిల్‌గా వుందికదా అని కార్లో వెళ్ళమంది అత్త." అంటూ శారద వైపు తిరిగి - "క్షమించు శారదా! నీ పర్మిషన్ లేకుండా కారును వుపయోగించాను" అన్నాడు క్షమార్పణ చెప్పుకుంటూ.

"భలేవాడివే...కారెందుకు వుపయోగించేవని ఎవరడిగారు?" అంది శారద నవ్వుతూ.

"ఎలాగూ ఇంతవరకూ వచ్చానుగదా! ఈ ఊటీ కూడా చూసి పోదామని వచ్చాను" అన్నాడు సుందరం మళ్ళీ.

"మంచిపని చేశారు! అనుకోకుండా కలిసాం .... ముగ్గురం సరదాగా చూడొచ్చు ఇవన్నీ" అన్నాడు రాఘవ.

"నో నో....మీ దంపతుల మధ్య నే నెందుకు? మీరు వెళ్ళిరండి నేనీ రోజువుండి, రేపు వెళ్ళిపోతాను" అన్నాడు సుందరం.

"భలేవారే! దానికీ దీనికీ సంబంధ మేమిటి ? మీరేమైనా రాత్రీ పగలూ మమ్మల్ని అంటిపెట్టుకుని వుంటారా? ఇంతకీ మీ రెక్కడ దిగుతున్నారు?" అన్నాడు రాఘవ నవ్వుతూ.

అక్కడ్నుంచి వాళ్ళు వెనక్కు వెళ్ళి, హోటల్‌లో నుంచ

రానికి ఒకరూము బుక్ చేయించి, అతని బాగ్ని అందులో వుంచి మళ్ళా క్రిందికి వచ్చారు. రాఘవా, శారదా వున్న ఫ్లోర్‌లోనే నాలు గైదుగదుల తర్వాత వుంది సుందరం గది.

* * *

ముగ్గురూ నడుస్తున్నారు - కబుర్లు చెప్పుకుంటూ మధ్యన రాఘవ, అతనికి చెరోవేపు సుందరం, శారదా వున్నారు.

ఒక క్రాస్ రోడ్లో ఏదో కారు అడ్డువచ్చి ఆ వరుసక్రమం తప్పింది. దాని ప్రకారం, మధ్యన శారద, ఆమె కిరుప్రక్కల సుందరం, రాఘవలు వారికి తెలియకుండానే కలిసి నడిచిపోతు న్నారు. ఇంతలో మధ్యలో ఒకదగ్గర మనసు నాకర్షించే దృశ్య మేదో కనబడేసరికి రాఘవ అది చూస్తూ వారికంటే కాస్త వెనుక పడ్డాడు. అది గమనించని శారద, సుందరం ముందుకు సాగిపోతు న్నారు ఏదో మాట్లాడుకుంటూ.

సుందరం సహజంగా అందగాడు - శారద ప్రక్కన నడు స్తున్న అతను ఆమెకు సరియైన జోడీలా వున్నాడు. దానికితోడు అతడు వేసిన ఏదో విట్టుకు ఆమె పెద్దగా నవ్వుతోంది. సరిగ్గా అదే సమయానికి వారి కెదురుగా వస్తున్న ఒక జర్మన్ దంపతులకు ఆ దృశ్యం ఎంతో ముచ్చట గొలిపింది.

వెంటనే వీరి వద్దకువచ్చి వారిభాషలో ఏదో అడిగారు. వారి భాష అర్థంకాని శారద, సుందరం తెల్లబోయి చూస్తున్నంతలో, ఆ జర్మన్ మహిళ చేతిలోవున్న ఆటోమేటిక్ కెమెరా క్లిక్‌మంది. అది చూడగానే శారద గాభరాపడింది. అప్పటికి గుర్తుకువచ్చాడు రాఘవ ఆమెకు. ఖంగారుగా వెనక్కు తిరిగి చూసింది. దూరా న్నుంచి తల వంచుకుని, ఏదో ఆలోచిస్తూ వస్తున్నాడు రాఘవ. ఒక్కసారిగా అతనిమీద కోపం, జాలీ కూడా కలిగాయామెకు. ఈ కవులకున్న బుద్దేయిది. ఎప్పుడూ పరధ్యానంగా వుంటారు అను కుంది.

ఇవతల సుందరం ఆ జర్మన్ యువకునితో ఏదో అంటు న్నాడు ఇంగ్లీషులో-"మేం దంపతులం కామనీ, బంధువులమనీ." కాని ఆ భాషకూడా వారి కర్థంకాలేదు. ఇంతలో తన ఆటోమేటిక్ కెమెరాలోంచి ఫోటోతీసి యిచ్చింది ఆ జర్మన్ వనిత సుందరానికి.

సుందరం ఆ ఫోటో తీసుకుని ఆమెకు హావభావ ప్రకటనలతో తమనుగురించి చెప్పుకున్నాడు. అప్పటికి పరిస్థితిని గుర్తించింది ఆమె. క్షమార్పణ చెప్పుకుంటున్న ధోరణిలో వారితో ఏదో అంది. కాని, శారద కోపంగా వారివైపు చూసి, చర చరా ముందుకు వెళ్ళిపోయింది. వాళ్ళని పంపివేసి, సుందరం కూడా శారద వెనకాలే వచ్చాడు ఫోటోని తీసుకుని.

"చూడు శారదా: వద్దంటున్నా చేతిలో వుంచి వెళ్ళిపోయారు వాళ్ళు. ఏం చెయ్యటం?" అన్నాడు దిక్కుముఖం వేసుకుని చేతిలో ఫోటోని ఆమెకు చూపుతూ.

శారద ఇంకోవైపు ముఖం త్రిప్పుకుని "చింపిపారెయ్!" అంది చిరాగ్గా.

"చింపిపారేయట మెందుకు, అంత అందమైన ఫోటోని. దాచుకో బ్రదర్."

ఇద్దరూ ఉలిక్కిపడి వెనుదిరిగి చూశారు.

వారి వెనుక రాఘవ! నవ్వుతూ నించున్నాడు.

శారద చాలా ఇబ్బంది పడింది. కాని రాఘవ మాత్రం తన చేతిలోని ఫోటోవంక చూస్తూ "ఇలా చూడు శారదా! నువ్వు పలు వరుసనంతా బయటపెట్టి, విరగబడి నవ్వుతూంటే ఎంత బాగున్నావో తెలుసా? ఆ సొట్టలుపోయిన బుగ్గలు, విచ్చుకున్న పెదిమలు....ఎంత నాచురల్‌గా తీశారని?...." అంటున్నంతలో ఆమె మెరుపుతీగలా ముందుకు వచ్చి అతని చేతిలో ఫోటోని లాక్కుని ముక్కలు ముక్కలుగా చింపివేసింది.

ఖంగుతిన్నట్టుగా రాఘవ తలెత్తి—

"శారదా! ఏమిటది?" అన్నాడు ఆశ్చర్యంగా, మందలింపుగా.

"ఏమీలేదు. పదండి! రా బావా" అంది సుందరం వైపు చూస్తూ స్వాభావికంగా. సుందరం పని తేలుకుట్టిన దొంగలా అయింది.

* * *

ఆ రాత్రి పన్నెండుగంటల వేళ. శారదకు హఠాత్తుగా మెలకువ వచ్చింది. ప్రక్కన చూస్తే రాఘవ లేదు. ఎదురుగా టేబుల్

ముందు కూచుని, టేబుల్ లాంప్ వెలుగులో ఏవో రాసుకుంటు న్నాడు.

"ఏమి రాస్తున్నారు?" అంటూ లేచి వచ్చింది శారద.

రాఘవ చటుక్కున రాస్తున్న దానిమీద చెయ్యి అడ్డుపెట్టి—

"ఏదో నా ప్రియురాలికి విన్నపం...." అన్నాడు కవ్వింపుగా.

"ఇప్పుడేం తొందర? మీ ప్రియురాలూ మీరూ ఎక్కడికి పోతారు? రేపు పగలల్లా ఖాళీయేముందిగా? నిద్రపోరాదూ?" అందామె.

"పగలల్లా శ్రీమతిగారి సేవలోనే గడిచిపోతుంది. అయినా శారదా! పగటిపూటనే రాయాలి అంటే కాదు-నాకు భావావేశం కల్గి నప్పుడే రాయగలను" అన్నాడు రాఘవ నవ్వుతూ.

"సరే మీ ఆరోగ్యం పాడవుతుందని చెప్పానుగాని, నాకేం రాసుకోండి" అంటూ శారద కిటికీ దగ్గరకు వెళ్ళి అందులోంచి ఆకాశంలోని చంద్రుడ్ని, చుక్కల్ని చూస్తూ నుంచుంది.

"ఎంతసేపలా నుంచుంటావ్? అసలే ఈమధ్య బడలికగా కనబడుతున్నావ్ పడుకోరాదూ?" అన్నాడు రాఘవ రాసు కుంటూనే.

"నాకు నిద్ర తేలిపోయింది. ఇదివరకైతే ఇలా నిద్ర తేలి పోయినపుడు ఏం చేసేదాన్నో తెలుసా?" అంది.

"లేచి, మన్మథ రాసిన పుస్తకాలు చదువుతుండే దానివి, అవునా?"

"సరిగ్గా వూహించారు. చదువుతూంటే ఎప్పుడు తెల్లారేదో తెలిసేది కాదు."

"అయితే ఇప్పుడూ అవే చదువు."

"ఎలా చదవను? ఏం తేలేదుగా."

"పోనీ ఎదురుగాకూచుని, అతని సుందరముఖార విందాన్ని" రాసుకుంటూనే అన్నాడతను. అయితే ఆ మాటకు ఆమె కళ్ళలో కనబడే కోపాన్నీ, బాధనీ గ్రహించలేదతను. అసలే ఆమె మనసు వుదయం ఆ సంఘటన జరిగిన దగ్గర్నుంచీ బాధపడు తోంది. ఏమాత్రం బైటపడని రాఘవ అంతర్యమేమిటో ఆమెకు బోధపడలేదు.

"మీరు మాటిమాటికీ ఇలా మాట్లాడితే నాకు కోపం వస్తుంది తెలుసా?" అంది తీక్షణంగా.

ఆమెను మరింత కవ్వించాలనే వుద్దేశంతో "నీకు కోపం వస్తుందంటే మాటి మాటికీ ఆ మాటే అంటాను." అన్నాడు.

"హుం....వట్టి మొండిఘటం" అనేసి అక్కడ్నుంచి చర చరా బైట వరండాలోకి వెళ్ళిపోయింది, తలుపు తీసుకుని— "మంచులో అట్టేదూరం వెళ్ళకు శారదా!" అన్న అతని హెచ్చరి కను కూడా వినిపించుకోలేదామె.

బయట వరండాలో చల్లనిగాలి హాయిగా తగులుతోంది శరీ రానికి. బడలికగా వున్న శరీరానికీ మనసుకూ ఎంతో హాయి అని పించింది.

అక్కడ బాల్కనీలో పిట్టగోడ నానుకుని ఎవరో మనిషి నుంచుని వున్నాడు. కాస్త రెండడుగులు ముందుకువేసి, ఆ నుంచున్నది సుందరం అని గ్రహించింది.

వెనుదిరిగి వెళ్ళిపోదా మనుకున్నంత లోనే అతనే పిలిచాడు.

"రా....శారదా! వెళ్ళిపోతున్నావేం?.... నేనే సుందరాన్ని."

ఆ పిలుపుతో శారద వెనక్కి రాలేక, ముందుకు పోలేక, కాస్సేపు తటపటాయించి, చివరకు సర్దుకుని, సభ్యత కోసం ముందుకి రెండడుగులు వేసి,

"ఏం బావా! ఎంతసేపయింది నువ్వొచ్చి" అంది.

"ఇప్పుడే వచ్చాను. అది సరే.... ఇంత రాత్రివేళ నువ్వు వంటరిగా వరండాలో తిరుగుతున్నా వెందుకూ?"

"వూరికినే.... సగం నిద్రలో తెలివి వచ్చింది—మరి నిద్ర పట్టలేదు."

బయట శారద ఎవరితోనో మాట్లాడటం విని, గదిలోంచి ఇవతలికి వచ్చాడు రాఘవ.

"ఏం శారదా? బయట చెట్లతోగాని మాట్లాడుతున్నావా?" అన్నాడు గుమ్మం దగ్గర నుంచునే.

"ఛ.... మా బావతోనండీ, నా లాగే నిద్రపట్టక బైటకు వచ్చాడు." అంది శారద.

"వెరీ గుడ్.... కంపెనీ దొరికిందన్న మాట! మాట్లాడుతూ

వుండు. ఈ కాస్త ముగించుకుని నేను వచ్చేస్తాను."

"మీరూ రండి బ్రదర్!.... మాట్లాడుకుందాం కాస్సేపు...." అన్నాడు సుందరం.

"సారీ బ్రదర్!.... కొద్దిగా మిగిలి వుంది. అది ముగించి వస్తాను.... మీరు మాట్లాడుతూ వుండండి...." అంటూ లోపలికి పోయాడు రాఘవ.

అతను లోపలికి పోయాక—

"శారదా అలా పోర్టికోలోకి రా.... అక్కడకు పోయి మాట్లాడుకుందాం.... ఇక్కడ మాట్లాడితే మీ ఆయనకు డిస్టెర్బెన్స్...." అన్నాడు సుందరం.

శారద మౌనంగా నడిచింది— అక్కడకు నాలుగడుగులు వున్న పోర్టికోలోనికి.

అక్కడ ఇద్దరూ చెరో పిట్టగోడనూ అనుకుని కూచున్నారు, ఎదురెదురుగా.

శారదకు కాస్సేపు ఏం మాట్లాడాలో తోచలేదు. ఏదో ఒకటి మాట్లాడాలి కదా అని, చివరకు—

"ఏమిటి బావా! ఇందాక మీ ఫ్రెండును ఏదో అత్యవసరంగా చూడటానికి వెళ్ళానన్నావ్! ఏమయిందతనికి!" అని అడిగింది.

ఆ అవకాశం కోసమే, సరిగ్గా ఆ ప్రస్తావన కోసమే ఎదురు చూస్తున్న సుందరం— "ఆ!— ఏమీ లేదు— వాడికి కొడుకు పుట్టాడు. ఇదే ఫస్టు ఇస్యూ కావటం వల్ల, వాడికున్న ఆప్త మిత్రుడ్ని నేనే అవటం వల్ల సంబరపడి అర్జంటుగా రమ్మని రాశాడు. వాళ్ళావిడ అందంతో ఎంత అందమైన కొడుని కన్నాదో నని తీరా వెళ్ళి చూస్తే— రామచంద్రా!...." మధ్యలోనే ఆగిపోయాడు చెప్పలేక.

"ఏం? ఏమయింది? కుర్రాడు బాగా లేడా ?"

"బాగానే వున్నాడు. కాని వాళ్ళ నాన్నలాగా కారునలుపు. పోనీ, రంగు రాకపోతే రాకపోయింది; తల్లి ఆకారమైనా వచ్చిందేమోననుకుంటే, అదీ లేదు. అచ్చుగుద్దినట్టు వాళ్ళ నాన్న రూపునే పుణికి పుచ్చుకున్నాడు."

"అంటే? వాళ్ళ నాన్న అంత బాగుండడా?"

"అంత చూడలేనంత అనాకారి కాదనుకో. ఏమైనా ఆవిడ ముందు దిగదుడుపే...." అన్నాడు 'చూడలేనంత' అనే మాటలను వత్తి పలుకుతూ.

శారద మాట్లాడలేదు. మౌనంగా ఏదో ఆలోచిస్తూ వుండి పోయింది.

"పుట్టిన వాడు మగపిల్లవాడు కాబట్టి సరిపోయింది. అదే ఆడపిల్ల అయితే? జన్మలో దానికి పెళ్ళికాదు. అంతవరకూ గ్యారంటీ!... పాపం! ఆ తండ్రి అనాకారితనం వీడికి శాపమైతగిలింది...."

ఈ సారి ఆమె పెదవి విప్పింది—

"నిజంగానా బావా! తలిదండ్రుల ఆకారాలు అచ్చు గుద్దినట్లు పిల్లలకు వస్తాయా?" అంది నీరసంగా.

ఆ మాటకు నవ్వాడు సుందరం....

"శారదా! ఏమిటి నువ్వనేది? పిల్లలకు తలిదండ్రుల రూపు కాకుంటే మరెవరి రూపు వస్తుంది? ఇంతకీ నీసంగతిచెప్పు... నువ్వెవరి పోలిక— అచ్చు గుద్దినట్టు మీ నాన్న పోలిక. మీనాన్న అందగాడు కాబట్టి నువ్వు అందంగా వున్నావ్.... అదే అతను కురూపి అయితే! నిన్ను రాఘవకూడా చేసుకునేవాడు కాదు...."

"ఎందుకు చేసుకోరు?" అనాలోచితంగానే అనేసింది శారద.

"బాగుంది. నీకంటే అతని మీద రచయిత అనే వ్యామోహం...."

"సారీ బావా! నాది వ్యామోహం కాదు, ప్రేమ" అంది శారద చటుక్కున.

సుందరం జాలిగా చూశాడామె వంక.

"పిచ్చి శారదా! ఎందుకు నిన్ను నువ్వే మభ్యపెట్టుకుంటావ్ ? అతనిలో ఏమి చూసి ప్రేమించావ్!"

"ఏమో నాకే తెలీదు అతని సాహిత్యం.... అందులో ప్రతిఫలించే అతని వ్యక్తిత్వం, అతనెవరో తెలియని పరిస్థితిలో నన్నాతని వైపు బలంగా ఆకర్షించాయ్. అతన్ని కలుసుకున్న తరువాత కూడా అతని రూపం ముందు ఇవే బలాన్ని పుంజుకుని నిలబడ్డాయ్ , అతని జీవితంలో అడుగుపెట్టిన తరువాత అతని నిర్మల హృదయం, విశాల దృక్పథం ప్రేమైకమైన అతని సరళ

స్వభావం...."

"అంతంత పెద్ద సమాసాలెందుకులే శారదా! ఏమైనా అతని చూపాన్ని లెక్క చెయ్యనంత వరకూ అవి నిన్నతనిపైపు ఆకర్షించాయి. అవునా!...."

"అవును— అతనిపై గల ఆకర్షణతో ప్రేమతో ఆ సవాల్ కూడా ఎదుర్కొన్నాను."

"మంచిదే.... ఆ సవాలే ఇంకో రూపంలో వస్తే?"

"ఏ రూపంలో?"

"నీ బిడ్డ రూపంలో...."

"బావా?!!" ప్రక్కన పిడుగు పడినట్లు! అదిరిపోయింది ఆమె. ఏదో అదృశ్య హస్తం తన కళ్ళ ఎదుట తెరలు తొలగించి చూడలేని భయంకర దృశ్యాన్నేదో చూపుతున్నట్టనిపించింది.

"సారీ! మీ దంపతుల మధ్య భేదాన్ని గానీ, విభేదాన్నిగానీ సృష్టించటం కాదు నా వుద్దేశం. టేకిట్ ఈజీ...." అన్నాడు సుందరం ఓదార్పుగా.

అయితే ఆ మాటలు వినబడలేదామెకు. తొలగిన తెరలు వెనుక, ఎదురుగా ఉయ్యాలలో ఒక వికృతమైన బిడ్డ కారు నలుపుతో, చింపాంజీ ముఖంతో మూర్తిలా తన భర్తను పోలిన ఆకారం, గుక్కపట్టి ఏడుస్తున్న భయంకర దృశ్యం. తన సర్వేంద్రియాలనూ చైతన్య విహీనం చేసి, సవాల్‌ను ఎదుర్కొనమని వికటాట్టహాసం చేస్తోంది.

సుందరం అప్పటికి తృప్తిగా నిటూర్చాడు. స్త్రీలో బలహీనత ఎక్కడుందో అక్కడే సరిగ్గా దెబ్బ కొట్టాడు, తను. స్త్రీ ఎంత చదువుకున్నా, వివేకవంతురాలయినా, ఎంత గొప్ప ఆత్మ స్థయిర్యం గలదయినా—భర్తనెంత ప్రాణాధికంగా ప్రేమించినా, తన సంతానం విషయంలో మాత్రం పచ్చి స్వార్థపరురాలు. ఇప్పుడామెలో ఆ స్వార్థాన్నే రెచ్చగొట్టి—విజయ గర్వంతో తృప్తిగా నిట్టూర్చాడు సుందరం.

చెదిరిపోయిన మనసుతో అతని ముందు నుంచోవటం ఇష్టం లేక తన ఓటమిని అతడు గ్రహించకూడదనే వుద్దేశంతో తన గదిలోకి వచ్చేసింది శారద.

హఠాత్తుగా గదిలోకి ప్రవేశించిన శారదను చూసి— "అదేం శారదా! అప్పుడే వచ్చేశావేం? నిద్రవస్తోందా" అన్నాడు రాఘవ.

అతని ప్రశ్నలోనే జవాబు వుండటంతో—"అవును." అని ముక్తసరిగా జవాబు చెప్పేసి వెళ్ళి పడుకుంది.

పడుకున్నదన్న మాటే గాని, ఆమెకు ఒకంతటికిగాని నిద్ర పట్టలేదు. కేరుమని ఏడ్చి, ఒక వేళ నవ్వినా ఏడ్చినట్టుండే ఒక వికృతాకారపు పసిపాప రూపే మనో నేత్రమందు మాటి మాటికీ కనుపించటంతో నిద్రాదేవి ఒకంతటికి గాని ఆమెదగ్గరకు రాలేక పోయింది.

మర్నాడు ఉదయం పదిగంటలకు వెళ్ళిపోయాడు సుందరం. సుందరం ఎదుట ఏ బాధా లేనట్టు ధైర్యంగా తిరిగినా, అతను వెళ్ళి పోయాక మళ్ళా ఆలోచనలో పడిపోయింది శారద. తన మానస సరోవరంలో ఇన్నాళ్ళుగా అట్టడుగున ఎక్కడో నిద్రిస్తున్న ఒక వింత జంతువు. ఇప్పుడిప్పుడే కళ్ళువిప్పి వళ్ళు విదుల్చుకుని పైకి లేచి వస్తోంది. ఆ జంతువు చేస్తున్న భీభత్సానికి ఆ సరోవరమంతా అల్లకల్లోల మయిపోయింది. వున్నట్టుండి. ఎక్కడో పొరబాటు జరిగింది, అని అనుకుంటోం దామె.

"శారదా! నేనేదో తప్పు చేశాసనిపిస్తోంది. ఒక అందాల బొమ్మ, అపురూప సుందరి వలచి వచ్చిందన్న సంబరంలో కొన్ని ప్రాథమిక విషయాలను నిర్లక్ష్యం చేశాను" అన్న రాఘవ మాటలు జ్ఞప్తికి వచ్చాయామెకు.

సరిగ్గా ఇప్పుడామెకు అలానే అనిపిస్తోంది.

"అతనేకాదు. నేను కూడా మర్చిపోయాను, కొన్ని విషయాలు" అనుకుందామె. తమ సంతానం విషయమేమిటి? అది అతనుగాని, తానుగాని ఆలోచించామా? 'లవ్ ఈజ్ బ్లైండ్' అనే సామెతను అక్షరాల నిరూపించేం....ఛ.... ప్రేమ గుడ్డి దేమిటి? నేనేం గుడ్డిగా అతన్ని ప్రేమించలేదు.... అతనెవరో తెలియకుండానే ప్రేమించినదానికి గుడ్డి తనమేమిటి? తెలిసిన తరువాత కూడా వెనుదీయలేదే.... అదే నిజమైన ప్రేమ.... నిజమైన ప్రేమకు ముందు, వెనుక ఆలోచించడమంటూ వుండదు. మంచో చెడో ఒక మాటమీద నిలబడటమే దాని లక్ష్యం.... మంచిని సంతోషంగా

ఆహ్వానించినట్టి చెడుని కూడా ధైర్యంతో ఎదుర్కోవాలి....

అవును ఎదుర్కోవాలి. కాని ఎలా? అనుకోకుండా దారిలో ఎదురైన ఈ చెడుని ఎలా ఎదుర్కోవాలి?.... తనకు కలగబోయే సంతానాన్ని దాన్నుండి ఎలారక్షించాలి?....ఎలా? ఎలా?....

మళ్ళా నిరాశలో పడిపోతోందామె. అప్పటికప్పుడే ధైర్యం తెచ్చుకుని, మళ్ళా అంతలోనే కృంగిపోయి, ఆ రోజంతా అదే వరస....ఆశ నిరాశల మధ్య అలా తర్జన భర్జనపడి, ఇప్పు డేమను కుంటే ఏం లాభం? అంతా చేయి దాటిపోయింది అని వుదాశీనంగా వుండిపోయేది కాస్సేపు. సరిగ్గా అలాంటి క్షణంలోనే భయ సందేహా లతో మూసుకుపోయిన ఆమె మనో నేత్రం చటుక్కున తెరుచు కుంది.

అవునూ-వివాహానికి గమ్యం సంతానమే ఎందుకనాలి?.... సంతానమే లేని భార్యాభర్తలు ఎంతమంది లేరు! వారెంత హాయిగా బ్రతకటం లేదు?

ఈ ఆలోచనా తరంగం ఉవ్వెత్తున లేచి ఆమెలోని ఆవేద నను అల్లంత దూరానికి విసరికొట్టింది. ఆమెలోని నవనాడులూ క్రొత్త చైతన్యాన్ని పుంజుకుని క్రొత్త ఉత్సాహంతో పనిచెయ్యా నారంభించాయి.

అవును....అలాగే చెయ్యాలి. వివాహానికి గమ్యం సంతానం కాదు. ఒకవేళ అయినా ఇటువంటి వికృత రూపులుకాదు. నా కటు వంటి సంతానం వద్దు....అసలు సంతానమే వద్దు.... రాఘవ నాకు చిట్టిబాబు, రాఘవకు నేను బుజ్జిపాపను....

ఒకసారి కిల కిలా నవ్విందామె, ఆలోచన రాగానే.

అప్పుడే స్నానం చేసి బాత్ రూం లోంచి వస్తున్న రాఘవ అది చూచి అక్కడే ఆగిపోయాడు అబ్బురంగా.

"ఏమిటి ? రాణిగారు వున్నట్టుండి మూడ్ మార్చేశారు." అన్నాడు.

"మరి రాజావారు, రాణీవారి మూడ్ చూసి ఉదయం నుంచీ బెంబేలు పడిపోతున్నారుగా—అందుకని."

అతను మెల్లిగా అడుగులు వేసుకుంటూ ఆమె దగ్గరగా వచ్చి, ఇంకా దగ్గరగా ఆమెను తన వైపు పొదుపుకుంటూ—

"అవును శారదా! ఉదయం లేచిన దగ్గర్నుంచీ నీ ముఖం చూస్తోంటే గుండెలు పిండేసే బాధ! ఉదయం అంతా ఎందుకలా వున్నావ్?" అన్నాడు లాలనగా, ముంగురులు సర్దుతూ.

"ఏంలేదు....కొద్దిగా తలనొప్పి, అంతే" అంది అతని గుండెల్లో ముఖం దాచుకుంటూ.... "ఇప్పుడు పోయింది లెండి...." అంది మళ్ళా.

అతను చటుక్కున రెండు చేతులతోనూ ఆమె ముఖం ఎత్తి—

"అయితే నా కెందుకు చెప్పలేదూ!"అన్నాడు,మందలింపుగా.

"చెబితే ఏం చేసేవారు?" అంది, అతని కళ్ళల్లోకి చూస్తూ.

"డాక్టర్ని తీసుకు వచ్చేవాడిని.... అసలే ఈ వాతావరణం మంచిది కాదు. తగిన జాగ్రత్తలో వుండకపోతే అనారోగ్యంలోకి దింపుతుంది."

"ఏ అనారోగ్యమూ చెయ్యదు. నే చెప్పినట్టు వింటే నా కసలు తలనొప్పే రాదు" అంది నవ్వుతూ.

"చెప్పు శారదా!"

"చూడండి! ఎల్లప్పుడూ ఇలాగే మనం హాయిగా ఏకాంతంగా నవ్వుకుంటూ జీవితాన్ని గడపాలంటే ఏం చెయ్యాలి!"

"ఏకాంతంగా నవ్వుకుంటూ హాయిగా జీవితాన్ని గడపాలి" అన్నాడు.

"చాల్లెండి మీ జోకు.... కాని మనం ఏకాంతంగా వుండాలంటే ఎలా!"

"మనమిద్దరమే ఒక గదిలోకిపోయి తలుపులు బిగించుకుని, తలపులు విప్పుకుని...."

"ఆగండాగండి....మీ తలుపుల్ని బ్రద్దలు కొట్టుకుని, తలపుల్ని చిందర వందర చేస్తూ బయటనుండి అరునొక్క రాగం ఒకటి కర్ణ కఠోరంగా వినబడిందనుకోండి...."

"ఎవరిది? మీ సుందరం బావదా?"

"ఛీ! పాడు జోక్....మీ పుత్రరత్నానిదో, పుత్రికామణిదో" అంది శారద రుస రుసలాడుతూ....

"ఐసీ....అదా! అప్పుడేం చేస్తామో తెలుసా? ఏం చేస్తాం?-

ని.....తలపుల్ని బిగించుకుని, తలుపుల్ని తెరచుకుని బయటకు వెళ్ళి, వాడి నెత్తుకుని....."

"ఓదార్చి, జీజీకొట్టి నిద్రపుచ్చి, అప్పుడు మళ్లా లోపలికి వచ్చి, తలుపుల్ని బిగించుకుని, తలపుల్ని తెరచుకునేవేళ, మళ్ళా బయటనుంచి అరున్నొక్క రాగం వినిపించగానే, చటుక్కున మళ్లా తలపుల్ని బిగించి....."

"ఆపండి లాయర్‌గారూ! ఆపండి! వింటూంటే బుర్రతిరుగుతోంది." బిడ్డనెత్తుకుని వచ్చిన మేనక ముందరి విశ్వామిత్రుడి ఫోజు పెట్టాడు.

"మరి, వింటూంటేనే బుర్ర తిరిగితే అనుభవించినప్పుడెలా వుంటుంది?"

"ఎలా వుంటుందా. ఆ పుత్రరత్నమో, పుత్రికామణో వున్నారు చూశావూ, వాళ్ళ ముత్తాతలు కనబడి నట్టుంది....."

"మరి అటువంటి పరిస్థితిని కొన్నాళ్ళవరకూ వాయిదా వెయ్యాలంటే ఏం చెయ్యాలి?"

ఆమె ఆ ప్రశ్నవేసిన వెంటనే తెలిసిందతనికి ఏం చెయ్యాలో. కాని కొంతసేపు స్తబ్ధుగా వుండిపోయాడు, అలానే ఆమె ముఖం లోకి చూస్తూ.

"ఏమిటలా చూస్తారు? మాట్లాడరేం?"

"అదే ఆలోచిస్తున్నాను. ఇంత చిన్న వయసులో అంత లీడింగ్ లాయర్‌వి ఎలా అయ్యావా అని ఇన్నాళ్ళూ అబ్బురపడేవాడిని. ఇప్పుడర్థమయింది. ముద్దాయిని ప్రశ్నలువేసి, హడలుగొట్టి, బెదరగొట్టి సరిగ్గా నుంచోబెట్టి నీకు కావలసిన సమాధానాన్ని వాడిచేతనే చెప్పించే నేర్పు, నీకు వుగ్గుపాలతోనే వచ్చినట్టుంది. అవునా?" అన్నాడు రాఘవ.

అతని కాంప్లిమెంటుకు కృతజ్ఞతను తన కళ్ళతోనే చెప్పి "కవిగారేమిటీవాళ ఇలా భట్రాజులుగా మారేదు........?" అంది నవ్వుతూ.

"పొగిడితే ఏమైనా బహుమతి లభిస్తుందేమోనని....."

"ఇకమీదట కేవలం పొగిడినంత మాత్రాన బహుమతి లభించదు."

"మరేం చెయ్యాలి?"

"చెప్పినట్టు వినాలి."

"ఏం వినాలి?"

"అదుగో మళ్ళా మొదటికి వచ్చారు....రామాయణం అంతా విని...."

"కాదు, కాదు. ప్రేమాయణం అంతా విని. శారద రాఘవ కేమవుతుందన్నట్టు...."

ఇద్దరూ నవ్వుకున్నారు ఒక్కసారిగా.

మధ్యలో ఆమె తక్కున నవ్వునాపేసి "ఇంతకీ ఆ విషయంలో మీ అభిప్రాయం ఏమిటో చెప్పావుకాదు...." అంది సీరియస్‌గా.

"నా అభిప్రాయం అంటూ వేరే వుంటుందని ఎలా అనుకున్నావ్ శారదా! నీ అభిప్రాయమే నా అభిప్రాయం....నీఆలోచనే నా ఆలోచన....నీచూపే నాచూపు....అసలు నీ వూపిరే నా వూపిరి, సరా!"

"సరి సరి....మీ అభిప్రాయం ఎంత సుముఖంగా వుందో బలంగా నా హృదయంలో నాటుకుంది స్వామీ!....దానికి తగిన ఏర్పాట్లేవో వెంటనే చెయ్యండి."

"అదికూడా తమరే చెప్పండి! మీకుఅనువుగావుండే పద్ధతినే అనుసరిద్దాం."

ఆమె కొంచెం సిగ్గుపడింది. "అదికూడా నేనే చెప్పాలేంటి? ఏ ఫామిలీ ప్లానింగ్ ఆఫీసుకు వెళ్ళినా చెబుతారు."

దానికి నవ్వాడతను. "దేవిగారింకా పాత రాతియుగంలోనే వున్నారు. వీటిని గురించి తెలుసుకుందుకిప్పుడు ఫామిలీ ప్లానింగ్ ఆస్పత్రులు అక్కర్లేదు. రోడ్డుప్రక్కనున్న కిల్లీ షాపులు చాలు" అన్నాడు.

"అబ్బ! ఏదో చేద్దురూ! ఊరికే నస...."ఆమె నును సిగ్గును చిరుబురులతో రుసరుసలతో ప్రదర్శించి గమ్మున బాత్ రూంలోకి పోయి తలుపు వేసుకుంది.

* * *

మనిషి వొకటి చేయబోతే దేముడింకొకటి చేయిస్తాడనే

ఏజెం యిక్కడ విరూపించబడింది. ఆ సాయంత్రం ఆ పనిమీదనే బజారుకు వెళ్ళివచ్చిన రాఘవకు, రూంలో శారద నీరసంగా, దిగులుగా మంచంమీద పడుకుని వుండటం కనుపించింది. మాట్లాడబోతే ఏడుపు వచ్చేటట్టుగా వుందామెపని.

తాను ఏదైతే జరగకూడదనుకుందో అదే జరుగుతోంది. అయితే యిదే తొలిసారి అవటం వల్ల తాను గ్రహించలేక పోయింది.

శారద నలతగా పడుకుని వుండటం చూసి రాఘవ డాక్టర్ని వెంటబెట్టుకు వచ్చేడు.

డాక్టర్ వచ్చేవరకూ శారద అలాగే పడుకునివుంది. డాక్టర్ రాగానే లేచికూచుంది. పరీక్ష అయిన తర్వాత డాక్టర్ వచ్చి రాఘవను అభినందించాడు.

"ఎందుకు డాక్టర్!" అన్నాడు రాఘవ అర్థంకాక.

"ఎందుకేమిటి? మీరు తండ్రి కాబోతున్నారు" అన్నాడు డాక్టర్, బాగ్ సర్దుకుంటూ.

అది విన్న రాఘవ ఆనందానికి హద్దులేదు. డాక్టర్ని సాగనంపిన వెంటనే సుడిగాలిలా వచ్చిపడ్డాడు లోపలికి.

"థాంక్యూ శారదా! థాంక్యూ వెరీమచ్!!....." అన్నాడు వెళ్ళి మంచంమీద ఆమె దగ్గరగా కూచుని, వొళ్ళోకి తీసుకుంటూ.

ఆమె మాట్లాడలేదు. పేలవమైన చిరునవ్వొకటి నవ్వి, రబ్బరుబొమ్మలా అతని వొళ్ళో వాలిపోయింది.

ఇదేమీ గమనించని రాఘవ ఉత్సాహంతో చెప్పుకపోతున్నాడు.

"శారదా! నా ఆనందాన్ని ఎలా తెలియచెప్పాలో తెలియటం లేదు. ఇది నా జీవితంలో మరో మలుపు. అర్థంలేని నా జీవితానికి ఈ రోజు మరో అర్థం....శారదా! డాక్టర్‌గారు ఎన్ని మందులు టానిక్కులు రాసిచ్చారో తెలుసా? నువ్వు అవన్నీ వాడాలి.... నాకో పండంటి కొడుకు లేదా కూతుర్ని లేకపోతే యిద్దర్నీ కనివ్వాలి...."

అతనిలా చెప్పుకపోతూంటే శారద వింతగా అతని ముఖంలోకి చూస్తూ వుండిపోయింది.

"మాట్లాడవేం శారదా? ఎందుకలా చూస్తున్నావ్?" అన్నా
డామెను కుదుపుతూ.

"ఇలా మాట్లాడుతున్నది మీరేనా అనిపిస్తున్నది."

"ఏం? ఎందాకలా అనిపిస్తోంది?"

"ఎందుకా? ప్రొద్దున మీరేమన్నారు? నా అభిప్రాయమే మీ అభిప్రాయమనీ, నా కోరికే మీ కోరికనీ, మరీ నా వూపిరే మీ వూపిరనీ...."

"అన్నాను....కానీ మన కోరికలతోటీ, వూపిరులతోనూ సంబంధం లేకుండా ఇంకో జీవం నీలో వూపిరి పోసుకుంటోంది. ఇప్పుడేం చేద్దామని?"

"ఏం చేస్తాం! ఏమీ చెయ్యలేం...." జరగకూడనిదేదో జరిగిపోయిందన్న భావం మెదిలిందామె మాటల్లో...."కాని ఇందాక మీరన్నారే 'నా వూపిరే మీ వూపిరి' అని, అది నిజంకాదని ఇప్పుడు రుజువయింది" అంది మళ్ళీ.

"శారదా?!" ఉలిక్కిపడి చూశాడు రాఘవ ఆమెవైపు.

"అవును. ఇందాకటి నా అభిప్రాయాన్నే మీరు మన స్ఫూర్తిగా సమర్థించి వుంటే ఇప్పుడిలా ఉత్సాహంగా మాట్లాడి వుండరు. పిల్లలంటే ఇంత ఆనందాన్నీ, ఉత్సాహాన్నీ మనసులో దాచుకుని, కేవలం నా కోరికే మీ కోరికనీ...."

"శారదా! ప్లీజ్!....నన్ను నమ్ము....ఇప్పటికీ నీ కోరికే నా కోరిక, నీ వూపిరే నా వూపిరి...."

"అయితే డాక్టర్ మాట విని నేను బాధపడుతోంటే మీరెందుకు సంతోషిస్తున్నారు?"

అతను వినగూడనిదేదో వింటున్నట్టుగా ముఖం పెట్టి, "శారదా! ఏమిటి? ఏమిటి నువ్వంటున్నది?! ఈ మాట విని నువ్వు బాధపడుతున్నావా? నిజమా?!"

"నిజమే....నాకిప్పుడిది ఇష్టంలేదు..."

ఆ జవాబు విన్న తర్వాత కొంతసేపటి వరకూ అతను నోరు మెదపలేక పోయాడు. తర్వాత ప్రయత్నం మీద పెదవి విప్పి,

"శారదా! నిజంగానా?! నిజంగా నీకిష్టంలేదా? మన యిద్దరి

మధ్య ఒక పండంటి పాపాయి రావటం నిజంగా నీకు బాధగా వుంటుందా?"

శారద వేదాంతిలా నవ్విం దీసారి....

"పండంటి పాపాయి రావటం నాకు మాత్రం ఎందుకు యిష్టం వుండదూ?" అంది 'పండంటి' అనే మాటను వత్తి పలుకుతూ.

రాఘవకు అర్థంకాలేదు ఆమె ధోరణి.

"అదేమిటి శారదా! మరి ఇప్పుడేకదా పిల్లలు వద్దన్నావ్?"

"అన్నాను. కాని, ఇప్పుడు తప్పదుగా...." అంది భారంగా నిట్టూర్చి.

రాఘవకు అంతుబట్టలేదు ఆమె మనోగతం....

"శారదా! నీ మనసేం బాగోలేనట్టుంది. అలా చల్లగాలికి తిరిగి వద్దాం పద..." అన్నాడు ఇంకేమనాలో తెలీక.

ఆమె కూడా దానికేం అభ్యంతరం పెట్టలేదు. మౌనంగా లేచి, నిర్లిప్తంగా తయారయి, మరబొమ్మలా అతనివెంట బయటకు నడిచింది.

* * *

ఇంటికి చేరిన తరువాత శారదకు కలిగిన 'నలతి' సంగతి తెలిసింది సుభద్రమ్మకు. అదివిని, ఆమె ఎంతో పొంగిపోయింది. అయితే ఆ సంతోషం ఎంతసేపో నిలవలేదామెకు. ఆ సాయంత్రం సుందరం, పనిగట్టుకు వెళ్ళి దానివల్ల వచ్చే విపరీత పరిణామాల్ని, తద్వారా కలగబోయే మనఃక్లేశాన్ని వివరించేసరికి ఆమె డీలా, అయిపోయింది. దానికి తోడు ఆమె కూతురి వాలకం గూడా, ఆమె చెప్పకపోయినా అలాగే వుండటంతో ఆమె మరింత విరక్తి చెందింది. అదివరకు రాఘవమీద వున్న ఏపాటి అభిమానమో ఈ సంఘటనతో తుడిచి పెట్టుకపోయింది. అతనిపట్ల ఒక విధమైన వుదాసీన భావం ఏర్పడిందామెలో.

అయితే రాఘవ దీన్నంతగా పట్టించుకోలేదు. దానిక్కారణం ఆంధ్రదేశంలోని అన్ని ప్రముఖ పత్రికలూ మొట్టమొదటిసారిగా అతనిని గురించి లోకానికి వెల్లడిచేస్తూ, ప్రకటనలూ, వ్యాసాలూ ప్రచురించసాగాయి. కొన్ని పత్రికలు శారదతో కలిపి తీసిన అతని

ఫోటోలు ప్రకటించాయి. దానితో పాఠక లోకం గగ్గోలెత్తి పోయింది. ఇన్నాళ్ళుగా తమను ఆకట్టుకున్న 'మన్మథ' ఇతడేనా? భగవంతుడింత అన్యాయం చేస్తాడా? అతని అజ్ఞాతవాసానికి కారణం అతని రూపమా? ఏమైనా అదృష్టవంతుడు.... శారదవంటి అందమైన భార్య లభించింది. వారి కలయిక నిజంగా ఒక అద్భుతమైన నవల!....ఈ విధంగా రాఘవ గురించి పాఠకులనుండి సానుభూతితో, ప్రశంసలతో నిండిన లేఖలు అటు పత్రికలకూ, ఇటు రాఘవకూ కూడా కుప్పలు తిప్పలుగా వచ్చిపడ్డాయి.

అయితే పాఠక లోకంలో కలిగిన ఈ సంచలనం శారదలో కూడా మార్పుని తీసుకువచ్చింది. తన రాఘవ ఉనికి పత్రికా ప్రపంచంలో, పాఠక లోకంలో ఇంతటి సంచలనాన్ని తీసుకు వస్తుందని శారద ఊహించలేదు. అటువంటి వ్యక్తిని పొందిన తాను ధన్యత చెందాననుకుంది. మనసులో నిప్పులా కాల్చివేస్తున్న దిగులుపై తాత్కాలికంగా నివురు కప్పుకొంది. ఇదివరకటి ఉత్సాహం లేకపోయినా అతని ఆనందంలో పాలుపంచుకుంది. అతనికి జరిగిన రెండుసన్మాన సభలలోకూడా పాల్గొని వచ్చింది.

కొన్నిరోజులు దొర్లిపోయాయి. ఆమెలో వచ్చిన మార్పు రాఘవలో కూడా నూతనోత్సాహాన్ని కలుగజేసింది. ఆ వుత్సాహం తోనే అతడు మరొక కొత్త నవల రాశాడు. దానినెవరో పబ్లిషర్ కిచ్చేబదులు తామే స్వంతంగా పబ్లికేషన్ స్థాపించి ప్రచురిద్దామనుకున్నారు. ఆ ఆలోచన వారికిదివరకే ఉండటంవల్ల వెంటనే అది కార్యరూపం ధరించింది. కొద్దిరోజులలోనే ఆ నగరంలో 'శారదా పబ్లికేషన్స్' అనే ప్రచురణ సంస్థ వెలిసింది. అంతేకాదు, వారు స్వంత ప్రెస్‌ను కూడా అమర్చుకున్నారు.

ప్రచురణ సంస్థకు శారద యజమానురాలు. సుందరం పార్టనర్....అది ఆమె పేరనే రిజిష్టరు అయింది. ప్రెస్‌ని మటుకు రాఘవ పేరన రిజిష్టర్ చేశారు. రాఘవ ప్రెస్ బరువు బాధ్యతలు తను చూడలేననీ, తనపేర వద్దనీ అన్నాడు. అయినా సుందరం బలవంతం మీదనూ, సుందరం తండ్రి రామయ్య అంటే సుభద్రమ్మ అన్నగారు, ఆ బరువు బాధ్యతలు తను చూసుకుంటాననీ హామీ ఇవ్వటంవల్ల రాఘవ ఒప్పుకొనక తప్పిందికాదు. ఆ ప్రెస్‌ను

కొనటానికి రాఘవ తన భూముల్ని తాకట్టుపెట్టి, డబ్బు తెస్తానంటే శారద ఒప్పుకోలేదు. తను డబ్బు యిస్తానంది. కాని, ఆమెవద్ద డబ్బును పుచ్చుకుందుకు రాఘవ అంగీకరించలేదు. చివరకు సుందరం జోక్యం కలిగించుకుని, శారదచేత ఆ డబ్బును రాఘవకు అప్పుగా ఇప్పించాడు. శారద వద్దని వారిస్తున్నా వినకుండా రాఘవ ఆమెకు నోటురాసి యిచ్చాడు. ప్రచురణ సంస్థ, ప్రెస్సులను స్థాపించటంలో రాత కోతలన్నీ పూర్తి అయ్యాక, రాఘవ రాసిన నవలని మొట్ట మొదటిసారిగా ఆ సంస్థలో పబ్లిష్ అయింది. అది వారు వూహించినట్టుగానే ఎంతోలాభం చేకూర్చిపెట్టింది. చూస్తుండగానే ద్వితీయ ముద్రణ కూడా పూర్తయింది. ఒక నెలకు వంట్లో భారంగా వుండటంవల్ల శారద ఇప్పుడేమీ కేసులు తీసుకోటంలేదు. ఇంట్లోనే కూచుని ప్రచురణ సంస్థ, ప్రెస్ వ్యవహారాలను చూస్తోంది. శారదకు కోర్టు పని లేకపోవటంతో గుమస్తా శఠగోపం ప్రెస్‌లో రామయ్య క్రింద పనిచేయసాగాడు.

ఆ రోజు ఆఫీసులో శారద, రాఘవ కూచుని వుండగా సుందరం వచ్చి అన్నాడు.

''బ్రదర్! ద్వితీయ ముద్రణ జరిగేలోగా మీరు మరొక నవల మొదలెట్టండి ''

"నేనూ అదే అనుకుంటున్నాను. ఇంకా సరైన ప్లాట్ దొరకలేదు" అన్నాడు రాఘవ.

"ఏదో ఒకటి రాసేద్దురూ! మీ వంటి పేరున్నవాళ్లు ఏం రాసినా చెల్లుతుంది...." అన్నాడు సుందరం.

అది విని, "సారీ బ్రదర్ ! పాఠకులభిమానిస్తున్నారు కదా అని ఏదో వొకటి రాసి వాళ్ళ మొహాన పడవేయటం నా అభిమతం కాదు" అన్నాడు రాఘవ.

"అది నిజమే....ఏదో వొకటి చప్పున రాయాలికదా, అవి స్టాండర్డుని పాడు చేసుకోకూడదు'' అంది శారద.

శారద ఇలా అనటంతో సుందరం చిన్నబుచ్చుకున్నాడు. అయితే అది కనిపించనీయకుండా....

"అవును, స్టాండర్డ్ పోతే పాఠకులకు మీపై గ్లామర్ పోతుంది...." అన్నాడు.

"నేను గ్లామర్ కోసం చూడటంలేదు. నా పాఠకుల్ని నిరాశ పరచటం నాకిష్టం లేదు" అన్నాడు రాఘవ వెంటనే.

"అదీ నిజమేననుకో బాబూ! కాని ఈ సంస్థ కేవలం నీ రచనలు ప్రచురణ చేయటానికే ఏర్పడింది కాబట్టి, దాన్ని వూరికే వుంచకుండా ఇంకొక నవల పబ్లిష్ చేద్దామని అలా అన్నాడు మా సుందరం!" అంది అప్పుడే లోపల్నించి వస్తున్న సుభద్రమ్మ.

సుభద్రమ్మ తనపట్ల ఎలా వున్నా రాఘవకు అత్తగారుగా ఆమెపట్ల గౌరవభావం వుంది. అందుకనే ఇంకేమీ అనకుండా "అలాగే లెండి....ఈ రెండో కాపీ ముద్రణ అవుతోందిగా, అది పూర్తియ్యేలోగా ఇస్తాను" అన్నాడు.

"గుడ్....నేను చెప్పింది కూడా మీ కోసమే.... మీ పాఠకుల అభిమానాన్ని మీ రెప్పటికి అప్పుడు కీపప్, చేసుకోవాలి.... అందులో మా శారద కూడా మీ పాఠకురాలేనాయె...."అన్నాడు సుందరం నవ్వుతూ.

సుందరం వెళ్ళిపోయాక రాఘవ అన్నాడు.

"శారదా! మనం ముకుందపురం వెళ్ళి వద్దామా ఒకసారి!"

"ఇప్పుడెందుకు?"

"ఎందుకేమిటి? నువ్వు పండంటి పాపాయిని కనబోతున్నా వని తెలిసి, నరసయ్యా, అతని భార్యా వచ్చి పిలవలేదూ? వాళ్లింటికి...."

"పండంటి పాపాయి!" ఒక్కసారి పెద్దగాలి వీచి నిప్పుమీద నివురు ఎగిరిపోయింది. ఆమె మనసులో మళ్ళా నిప్పుల కణ కణ. దానితోబాటే మర్చిపోయిన దిగులు ఆమెలో మళ్ళా ప్రవేశించి చోటు చేసుకుంది.

ఆమె మౌనంగా ఉండిపోవటంతో,

"ఏం శారదా! నీకిష్టంలేదా ? లేకుంటే మానేద్దాం. ఏదో నీకు గాలి మార్పుగాను, నాకు ఉబుసుపోకగానూ వుంటుందని వెడదా మన్నాను" అన్నాడు రాఘవ.

"అబ్బే! అదేంలేదు. అలాగే వెడదాం...." అంది శారద తేరుకుని.

* * *

ముకుందాపురంలో మళ్ళా సాదరపూర్వకమయిన స్వాగతం

శారదను అపురూపంగా చూసుకున్నారు.

ఆ సాయంత్రం నరసయ్య భార్య శారదను పెరట్లో నంది వర్ధనం చెట్టుక్రింద కూచోబెట్టుకుని ఆమెకు జడ వేస్తూ,

"అమ్మాయ్! అచ్చు నీ పోలికతో పండంటి అబ్బాయిని కనాలి. తెలుసా?" అంది

దానికి శారద పేలవంగా నవ్వి "అచ్చు నా పోలికతోనే పుడతాడనేముందండీ? వాళ్ళ నాన్నగారి పోలికతో పుట్టకూడదా?" అంది.

"వద్దమ్మా! అది పగవాళ్ళకక్కూడా వద్దు. వాడి నాన్న వాళ్ళ నాన్న పోలికతో పుట్టి నరకం అనుభవించాడు. మళ్ళా వీడికీ అదే రావాలా?"

శారద వెన్నులో గునపం దింపినట్టయింది. గిరుక్కున వెనుదిరిగి చూసింది వెర్రిగా.

"ఏమిటి? మామగారు కూడా ఈయన పోలికేనా?" అంది తడారిన గొంతుకతో.

"అదేమిటమ్మా! ఇతను వాళ్ళ నాన్న పోలిక అను.... అచ్చు ఆ తండ్రిని పోలి పుట్టాడీ బిడ్డడు....పోతే, తల్లి మాత్రం నలుపైనా రూపుగలది. ఆవిడ రంగూ, ఆయన రూపం పుణికి పుచ్చుకునే ఈ లోకంలో పడ్డాడీ బిడ్డ....పాపం! వాళ్ళమ్మ ఎంత కుమిలిపోయేదో ఈ బిడ్డను చూసుకుని."

ఆమె చెబుతున్నదేమీ శారదకు వినిపించలేదు. కళ్ళముందరి దృశ్యమంతా గిర్రున తిరగటంతో కుప్పకూలి చాపమీద అలాగే పడి పోయింది.

అది చూచి నరసయ్య భార్య లబో దిబోమంది. ఆమె కేకలకు వీధి అరుగు మీద కూచున్న నరసయ్యా, రాఘవా పరు గెత్తుకు వచ్చారు పెరట్లోకి 'ఏమయింది, ఏమయిందం'టూ.

"ఏమయిందని చెప్పనండీ? మాట్లాడుతూ మాట్లాడుతూ అలాగే తూలి పడిపోయింది బిడ్డ....వేగం వెళ్ళి వైద్యుడ్ని తీసుకు రండీ!" అంది ఏడుస్తూ, శారదను లేవనెత్తి వళ్ళో పడుకో బెట్టుకుంటూ.

అయితే శారద నా స్థితిలో చూచిన రాఘవ అంతకుముందే పరుగెత్తాడు వైద్యుడి కోసం. ఆ పల్లెటూరిలో ఒకే ఒక మెడికల్ ప్రాక్టీషనరు వున్నాడు. రాఘవ వెళ్ళి అతడ్నే తీసుకు వచ్చాడు. ఈ లోపున నరసయ్య, భార్య కలిసి శారదను తీసుకువెళ్ళి గదిలో మంచంపైన పడుకోబెట్టారు. డాక్టర్ వచ్చి ఒక ఇంజెక్షన్ చేసి, అది వీక్‌నెస్ వల్ల వచ్చిందనీ, అయితే మానసికంగా కూడా ఆమెకు విశ్రాంతి నివ్వాలనీ చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ ఇంజక్షన్ ప్రభావం వల్ల శారద ఆ రాత్రంతా మగతగా పడుకుంది. రాఘవ మాత్రం తెల్లవార్లూ ఆమె ప్రక్కనే కూచుని జాగరణ చేశాడు.

తెల్లవారి బాగా ప్రొద్దెక్కిన తర్వాత కళ్ళు విప్పిందామె.

ఎదురుగా వికృతమైన ముఖానికి తోడు ఎర్రబడిన కళ్ళతో రాఘవ కనుపించాడు.

అతన్ని చూచినవెంటనే చటుక్కున కళ్ళుమూసుకుందామె. అంతవరకు బుజ్జిపాపడి రూపంలో కలలో కనబడి కలవర పెట్టిన రూపం కళ్ళెదుట, కళ్ళముందర కనబడటంతో అసంకల్పిత చర్యగా ఆమె కళ్ళు వాటంతట అవే మూసుకుపోయాయి.

మనసు చివుక్కుమంది రాఘవకు. తనెంత పొరపాటు చేశాడు! శారద నిద్ర లేవగానే ఎప్పుడూ తనంత తానుగా ముఖం తప్పించే తను ఈ రోజు తనకు తానయి వెళ్ళి ఆమె కళ్ళ బడ్డాడు.

'భగవాన్! ఏం జరుగుతుందో' అనుకుంటూ,

"సారీ! శారదా! మరికాస్సేపు పడుకో....ఇప్పుడప్పుడే కళ్ళు తెరవకు" అంటూ అక్కడ్నుంచి లేచి వెళ్ళిపోయాడు.

అరగంట తర్వాత లేచింది శారద. ముఖం కడుక్కుని నరసయ్య భార్య ఇచ్చిన కాఫీ త్రాగింది.

అప్పుడు వెళ్ళాడు రాఘవ.

"ఎలా వుంది శారదా ?" అన్నాడు మంచంమీద కూచుంటూ.

ఆమె ఒకసారి అతని ముఖంలోకి చూసి "బాగానే వుంది..." అంది తలవంచుకుని.

కాస్సేపు వున్నాక అన్నాడు రాఘవ.

"శారదా! ఒకటడుగుతాను చెబుతావా?"

"ఏమిటి?" అందామె తలెత్తి.

"డాక్టర్, నీకు మానసికంగా విశ్రాంతి కావాలన్నాడు. ఏమయింది? నీమనసును గాయపరచిన విషయం ఏమిటి? నీకిష్టంలేకుండా ఇలా జరగటంవల్ల నేనా?"

ఆమె మాట్లాడలేదు. మౌనంగా వుండిపోయింది.

ఆమె మాట్లాడుతుందేమోనని కాస్సేపు చూసి, మళ్ళా తనే అన్నాడు,

"నాకు తెలుసు శారదా! ఇలా అవటం నీకు ఇష్టం లేదు. అదే నిన్ను బాధిస్తోంది. అవునా?....ఈ సంగతి నాకు మాత్రం ఏం తెలుసు? నాతో ముందుగా నువ్వు ఏమాత్రం చెప్పినా ఇట్లా అవకుండా జరిగేందుకు ప్రయత్నించేవాడ్ని....అది నాతప్పంటావా?"

"కాదు, నా తప్పు...." అంది శారద నిర్లిప్తంగా.

"అసలు శారదా! ఇది చెప్పు....నీకు పిల్లలంటే యిష్టం లేదా?"

"ఎందుకు లేదు? అందమైన పసిపాపలంటే ఇష్టపడనివారు మనుషులే కారు...."

"మరి?....ఏమిటి నీ అభ్యంతరం?"

"మనకు అందమైన పాపలు పుట్టాలిగా...."

"ఎందుకు పుట్టరు? నీ అందం సామాన్యమైనదా?"

ఈసారి ఆమె ఇంకొకవేపు మొఖం త్రిప్పుకుని అంది.

"పిల్లలకి కేవలం తల్లిపోలిక మాత్రమే వస్తుందని నమ్మకమేమిటి?"

"శారదా???!" ప్రక్కన బాంబు పడ్డట్టుగా త్రుళ్ళిపడ్డాడతను. "ఏమిటి?? ఏమిటి నువ్వనేది?...." వణుకుతున్న శరీరంతో, కంపిస్తున్న స్వరంతో కీచుగా అరిచాడతను.

ఆమె అప్పటికీ ఇటు తిరగలేదు. బహుశా తిరిగే ధైర్యం కూడా లేదేమో!

"అవును. నిజమే చెప్పాను....మనకు పుట్టబోయే బిడ్డకు మీ పోలిక రాకూడదా?"

"శారదా! నా పోలికా?....నా బిడ్డకు నా పోలికా?? ఈ దౌర్భాగ్యపు రూపమా??.....నో....." పిచ్చిగా అరిచాడతను.

ఈసారి చివుక్కున ఇటు తిరిగిందామె.

"మీరెంత కాదనుకున్నా ఏం లాభం?....మీకు మీ తండ్రి గారి పోలిక రాలేదా ?....''

ఈసారి అతని ముఖం మరింత నల్లగా మాడిపోయింది

"శారదా! ఎవరు? ఎవరు చెప్పారీ విషయాన్ని నీకు ?"

అతను 'అవును' అని వుంటే బాధలేకపోయేది. కాని, అది 'రహస్యం' అన్నట్టుగా అతను మాట్లాడటంతో ఆమెకు ఛర్రున కోపం వచ్చింది.

"ఎవరో చెప్పారు. ఏం? మీరు చెప్పనంత మాత్రాన దాగు తుందను కున్నారా ఇది?" అంది దెబ్బ తీస్తున్నట్టుగా.

ఈ పరిస్థితి అయోమయంగా అనిపించిందతనికి. గొంతు లోతు నీళ్ళలో బడి కొట్టుకుంటున్నట్టుగా వుక్కిరి బిక్కిరయాడు.

"శారదా! ఏమిటిది?, నేను దాచానా!? దాచవలసిన అవసరం ఏముంది? అసలు చెప్పవలసిన అవసరం ఏముంది? నా రూపం ఇలా వున్నప్పుడు, నా తల్లి రూపమో తండ్రిరూపమో ఇలా వుంటుందని తెలీదా?"

"ఏమో... ఎలా తెలుస్తుంది! కొంతమందికి గ్రహణ శూల వల్ల ఇలాంటి రూపం రావచ్చును. అయినా, మీ తండ్రిగార్కి ఇటువంటి రూపం వున్నప్పుడు, అదే రూపం మీకు వచ్చినప్పుడు, మీ పిల్లలకి మాత్రం ఆ రూపం రాదని గ్యారంటీ ఏమిటి!"

ఈ మాటతో అతనికి కోపం వచ్చింది—బహుశా, బహుశా ఏమిటి? అదే మొట్టమొదటి సారిగా ఆమెపై అతను కోపించటం.

"ఇప్పుడు నన్నిలా గ్యారంటీ అడక్కపోతే నీకు మాత్రం తెలీదా? మన పెళ్ళయితే మనకు పుట్టబోయే పిల్లలకి ఇటువంటి రూపు వస్తుందని...అయినా శారదా! పుట్టిన పిల్లకు ఏ రూపమయితే నేం?... మనకు పెంచక తప్పుతుందా? మా అమ్మ నన్ను పెంచ లేదా?"

"పెంచేవుంటారు... కాని, క్షమించండి! అంత ప్రేమగా నేను పెంచలేను" మళ్ళా అటు వైపు ముఖం త్రిప్పుకుందామె.

"శారదా??!" మళ్ళా మరొక దెబ్బ...

"కాకి పిల్ల కాకికి ముద్దంటారు.... అంతపాటి ప్రేమకూడా లేదా నీకు!"

"నేను కాకిని కాను..." ఠకీమని వచ్చింది సమాధానం.

"ఓహ్! శారదా! ఎందుకిలా దెబ్బలు కొడుతున్నావ్? నేనేం చేశానని?" బాధగా అన్నాడు.

"ఏం చేశారో తెలీదా? మళ్ళీ చెప్పాలా? తెలిసివుండీ రహస్యాన్ని దాచారు. మళ్ళీ అటు వంటిది జరక్కుండా వుండేందుకు మీరెటువంటి ప్రయత్నాన్నీ చెయ్యలేదు."

"శారదా! నువ్వింత తొందర పాటు మనిషివనీ, అనాలోచితంగా ఇటువంటి నిందలు వేస్తావనీ అనుకోలేదు. బహుశా ఈ పై గుణాల వల్ల నేనన్ను ప్రేమించాననుకుని భ్రమపడి ఉంటావ్... అవునా?"

"మీ రెందుకలా అనుకుంటారు? మిమ్మల్ని పెళ్ళాడినందువల్ల నేనేం బాధ పడటంలేదే! నేను ఇష్టాపూర్వకంగా మనసా వాచా మిమ్మల్ని ప్రేమించాను."

"వొద్దు శారదా! ప్రేమ వూసెత్తకు. అది ఎప్పుడో మన మధ్య నుండి పారిపోయింది. అయినా మనం మనసా వాచా ఒక పని చేసినప్పుడు దాని ఫలితాన్ని కూడా అలాగే స్వీకరించాలి. అనుభవించగలగాలి. అప్పుడే అది నిజమైన ప్రేమ అనిపించుకుంటుంది."

"పోనీ నాది అబద్ధపు ప్రేమే అనుకోండీ.... కాని అటువంటి రూపుగల పిల్లవాడ్ని పెంచే ఆత్మస్థయిర్యం నాకులేదు." అంది కళ్ళు మూసుకుని, మంచంపైన వెల్లకిలా వ్రాలుతూ.

"పోనీ ఇది చెప్పు.... సరిగ్గా అటువంటి రూపేగల ఆ పిల్లవాడి తండ్రిని చూసి వోర్చుకునే ఆత్మ స్థయిర్యం ఉందా?"

శారద ఒక్కసారి కళ్ళువిప్పి అతని వైపుచూడకుండాఏటో చూస్తూ— "దానికి నేను మొదటనే సిద్ధపడ్డాను. కాని ఈ రెండో దానికి మాత్రం నేను సిద్ధంగా లేను." అంది, మళ్ళీ కళ్ళు మూసుకుంటూ.

కొన్ని క్షణాలు తదేకంగా ఆమెనే చూస్తూ వుండిపోయాడు

రాఘవ. ఈమె తన శారదేనా? ప్రాణాధికంగా తనను ప్రేమించి అందర్నీ ఎదిరించి పెళ్ళాడిన శారదేనా ఈమె? అనుక్షణం కనుల పండుకూ, ఆరాధననూ, ప్రేమనూ నింపుకుని, తనను నీడలో వెంబడించిన అమృతమయి ఈమేనా? తన నీడ కనబడితే చాలు లేచి నడచి ఎదురొచ్చే ఈమేనా, ఇప్పుడిలా తన ప్రక్కన నుంచున్నా, తనేమీ కానట్టుగా, అసలు లేనట్టుగా కళ్ళు మూసుకుని పడుకుంది? ఎవరు నాటారు ఈ విషబీజాలు ఈమెలో? అతని మనసు కల్లోలితమయింది.

* * *

ఇంటికి వచ్చిన తరువాత రెండు మూడు రోజులవరకూ దంపతులిద్దరూ ముభావంగానే వున్నారు. పైకి అందరితోనూ మామూలుగా తిరుగుతున్నా, మాట్లాడుతూ వున్నా, అంతరంగాల్లో ఇద్దరికీ అగ్ని పర్వతాలు బ్రద్దలవుతున్నాయ్.... ఆ సెగలూ, పొగలూ సుభద్రమ్మ కనిపెట్టలేక పోయినా, సుందరం కనిపెట్టాడు. వారిద్దరిలో బాగా మార్పు వచ్చింది. రాఘవలో దిగులు, అభిమానం.... శారదలో ఉదాసీనత, చిరాకు.... అయితే ఆ చిరాకును రాఘవమీద గాక ఇంట్లో అందరిమీదా చూపిస్తుంది.

ఇంట్లో నౌకర్లకీ, పని మనుషులకీ, గుమాస్తాలకీ శారద ఎదురు పడటానికే భయంగా వుం దిపుడు. అది చూసిన రాఘవకు కూడా కొన్ని సమయాలలో ఆమెతో మాట్లాడటానికి జంకుగా వుంది.

కొంత కాలం వీరందరికీ దూరంగా వుంటే వాతావరణంలో మార్పు వస్తుందేమో అనుకుంటున్నాడు రాఘవ.... శారదను విడిచి వుండటం కష్టమే తనకు. కాని తను లేకపోవడం వల్ల ఆమెలో కాస్త రిలీఫ్ వస్తుందేమో..

ఆ సాయంత్రం ఆ కబురు చెప్పటానికే అతను శారద గదిలోకి వెళ్ళాడు. ఆమె గదిలో లేదు. క్రింద ఆఫీసులో అసలే వుండదు. ఏమంటే ఈ మధ్య కేసులేమీ తీసుకోవటం మానివేసింది. శారద, ఆ రెండు స్థలాల్లోనూ లేక పోవటంతో లైబ్రరీ రూంలోకి వెళ్ళాడు.

అయితే అక్కడ జరుగుతున్న గలాటా చూసి అక్కడే ఆగిపోయాడు.

శారద పని మనిషి మీద కేకలు వేస్తుంది. పనిమనిషి తల వంచుకుని వింటుంది. అది చేసిన తప్పల్లా, నాలుగైదు రోజుల్నించీ ఆ గదిని తుడవక పోవటం.... శారద ఈ మధ్య తరచుగా లైబ్రరీ రూంలోకి రావడం మానివేసింది. ఆమె రావటం లేదు కదా అని పనిమనిషి కూడా అశ్రద్ధ చేసింది. అయితే ఈ మధ్య ఎప్పుడూ లైబ్రరీలోనే కాలం గడిపే రాఘవ అది గమనించినా ఎవరితో చెప్పాలో, ఎలా చెప్పాలో తెలియక వూరుకున్నాడు.

"ఏమే.... ఇల్లంతా ఊడ్చిన దానివి ఈ గది ఊడ్వాలని తెలీదా?" శారద ప్రశ్న.

"మీరు రావటం లేదని నిన్నా మొన్నా తుడవటం లేదమ్మ గోరూ...." పని మనిషి సంజాయిషీ.

"ఏం? నేను రాకపోతే మాత్రం బాబుగారు రావటంలేదా? ఆయనకు మాత్రం శుభ్రత అక్కర్లేదనుకున్నావా?"

పని మనిషి మౌనంగా వుండిపోయింది.

"మరీ నిర్లక్ష్యం జాస్తి అవుతోంది... మనుషులు చూడక పోతే సరి, పని ఎగ్గొట్టాలని చూస్తారు... నీకు రెండుపూటలా తిండి పెట్టి నెలకి పాతిక రూపాయలు ఇస్తుంటే తిని కూచునేందుకు ఇది సత్రం అనుకున్నావా? డబ్బు తీసుకుంటున్నందుకు తగిన పని చేయాలని తెలీదూ?"

ఆమె మాటలు పని మనిషిని ఉద్దేశించి అనవచ్చు.... కాని అవి సూటిగా తననే అంటున్నట్టుగా బాధ పడ్డాడు రాఘవ. దానికి కారణం అంతకు ముందు రోజున జరిగిన సంఘటనే...

ఆ రోజు ఉదయం రాఘవ ఎప్పటిలాగానే కాఫీ, టిఫిన్, తీసుకుని పుస్తకం పట్టుకుని లైబ్రరీ రూంలో ఈజీ చైర్‌లో కూచున్నాడు. పుస్తకం చదువుతూ వుంటే అతనికి ఎప్పుడు నిద్ర పట్టిందో తెలియలేదు. కాని తిరిగి తెలివి వచ్చేసరికి మాత్రం ఆఫీసు రూం లోనించి సుందరం కేకలు వినిపిస్తున్నాయి. ఆ చీవాట్లు తింటున్న వ్యక్తి గుమాస్తా శఠగోపం— అతను చేసిన తప్పు ప్రెస్‌లో నిద్రపోవటం.

"చూశావయ్యా! ఇంత డబ్బు పోసి, ఇంత శ్రమపడి ప్రెస్ పెట్టి, పబ్లికేషన్ స్థాపించింది మిమ్మల్నందర్నీ వూరికే మేపడానికి కాదు. పని చెయ్యవలసిన సమయంలో నిద్రపోవటానికి బుద్ధి వుండక్కర లేదూ? డబ్బు తీసుకున్నందుకు తగిన పని చేయాలని తెలీదు?" అంతకు ముందే రాఘవ ఈజీ ఛైర్‌లో పడుకుని నిద్రపోవం బైట కిటికీ లోంచి చూశాడు అతను. పైగా మరొక క్రొత్త నవల ఏదైనా రాయమని రాఘవను అంతక్రితం రోజునే మళ్ళా అడిగితే —రాఘవ ఏమీ మాట్లాడలేదు.... దానా దీనా అతనికి వుక్రోషం పెరిగి ఆ కోపాన్ని గుమస్తాపై చూపుతున్నాడు.... ప్రెస్‌లో పెట్టిన చీవాట్లనే మళ్ళా రాఘవ వినాలని ఇంట్లో కూడా పెడుతున్నాడు. సరిగ్గా ఆ సమయానికేవచ్చిన శారద "ఏమిటి బావా! అది?" అని అడిగింది.

సుందరం.... శఠగోపం చేసిన, ఘోరమైన, తప్పుని గురించి చెప్పాడు.... అది విన్న శారద కూడా సుందరం అంత తీవ్రం కాకపోయినా కాస్త మెత్తగా అతన్ని మందలించింది.అవన్నీ లోపల్నించి వింటూ మౌనంగా వుండిపోవటం తప్ప మరేమీ చేయలేకపోయాడు రాఘవ.

సరిగ్గా ఇప్పుడూ అలాగే జరిగింది.... నిన్న శఠగోపం అయితే ఇవాళ పని మనిషి. నిన్న సుందరం అయితే ఇవాళ శారద.... కాని, కాని వాటి వెనుక నున్న వ్యక్తి మాత్రం తనే నేమో.... నిన్నటి వలెనే ఇప్పుడు కూడా చేసేదీ అనేదీ ఏమీలేక మౌనంగా వుండిపోయాడు రాఘవ .... అయినా ఏం చేసేందుకూ ఏమనేందుకూ ఆ యింట్లో తనెవరని?....

అనవలసిన నాలుగు మాటలు పనిమనిషిని అనేసి చర చరా బయటకు వచ్చిన శారద గుమ్మం బైట రాఘవను చూసి, ఠక్కున ఆగిపోయి....

"ఎంత సేపయింది మీరు వచ్చి?" అని అడిగింది.

"ఇప్పుడే అన్నాడు...." రాఘవ.

"నాలుగు రోజుల్నించీ గది తుడవకపోతే మీరెలా కూచున్నారీ గదిలో?"

మాట్లాడలేదు రాఘవ.

"మిమ్మల్నే.... నాతో చెప్పొద్దూ?" రెట్టించిం దామె....

"ఎలా చెప్పాలో తెలియలేదు.... పైగా నిన్నంతా నువ్వు నీ గదిలోంచి బయటకు రాలేదు...."

"ఏం? నాగదిలోకి మీరు రాకూడదా? అలాగని ఏమైనా నిషేధం వుందా?"

అలాటి నిషేధం ఏమీ లేకపోయినా ఈ మధ్య రాఘవ తనంతట తానుగా ఆమె దగ్గరకు వెళ్ళడానికి సందేహిస్తున్నాడు. వెడితే నోటివెంట ఏమాట వస్తుందో, అది తీరా ఏ వాగ్వివాదాలకు దారి తీస్తుందేమోనని భయం పట్టుకుం దతనిలో.... ఉదయం లేచిన దగ్గర్నుంచీ రాత్రి పడుకోబోయేవరకూ సాధ్యమైనంతవరకు ఆమెను తప్పించుకునే తిరుగుతున్నాడు. ఆమె కూడా ఇదివరకు అతను కాస్సేపు కనిపించక పోతే వెదుక్కుంటూ వచ్చేది. అటువంటిది ఇప్పుడు యాధృచ్ఛికంగా కనబడితే తప్ప అతన్ని పలకరించడంగానీ, అతనితో మాట్లాడటం గాని చేయటంలేదు. రాత్రి మాత్రం తప్పటం లేదిద్దరికీ. అప్పుడు ఇద్దరూ మంచంమీద దూరదూరంగా పడుకునో లేక కూచునో కాస్సేపు దిక్కులు చూసేవారు. లేదా, అతికీ అతక నట్టుగా ఏవో రెండు మాటలు మాట్లాడుకునేవారు. ఆ సమయంలో శారద కేవలం నిరాసక్తంగా వుండేది. ఆమె నిరాసక్తత చూచి రాఘవ జంకేవాడు. ఎప్పుడైనా రాఘవ చొరవ తీసుకుని ఆమెపైపు తిరిగి మీదను చెయ్యివేస్తే మొగ్గలా ముడుచుక పోయేది, కర్రలా బిగుసుక పోయే దామె. అది చూచి రాఘవ "శారూ! వంట్లో బాగో లేదా?" అనే వాడు, ఆమె ముంగురులు సవరిస్తూ.

"అవును...." అనేది శారద ముక్తసరిగా.

"సరే పడుకో....కాని చిన్న రిక్వెస్ట్—".

ఏమి టన్నట్టుగా కళ్ళతోనే అడిగేది ఆమె.

"నీ గుండెల్లో ముఖం దాచుకుని పడుకోవద్దా?"

భయం భయంగా ఆశగా అతను అలా అడిగే సరికి కరిగి పోయేదామె....దానికి సమాధానంగా తనే ఇటుతిరిగి అతని తలను తీసుకుని తన గుండెల్లోకి పొదువుకుని చుట్టూ చేయిబిగించి పడునేది.

అయితే ఆ దివ్యసుషుప్తిలో ఎంతోసేపు అలా వుండే అదృష్టం లేకపోయే దతనికి .... అలా పడుకున్న కాస్సేపటికి ఆమెలో వింత వింత ఆలోచనలు కలిగేవి .... తన గుండెల్లోకి వత్తుకునివున్న అతని ముఖం, తన ఛాయను అలానే తన శరీరాన్ని చీల్చి గుండెలోకి ప్రవేశింపచేసి, అక్కడనుంచి తన పొట్టలోకి పంపి అక్కడ రూపుదిద్దుకుంటున్న తన చిన్నారి బాబుకు అతికించి నట్టనిపించేది.

ఆలోచన రాగానే ఆమె భయంతో కంపించి పోయేది. అతని చుట్టూ పెనవేసుకున్న చేతిని సడలించి అసౌకర్యంగా కదిలేది. ఆ కదలికకు రాఘవ తలెత్తి,

"ఏం శారదా!" అని పిలిచేవాడు.

ఆమె సంకోచిస్తూనే "నాకిలా బాగులేదు, ఆయాసంగావుంది. నేనే మీగుండెల్లో తలదూర్చి పడుకుంటాను" అనేది మెల్లగా.

అతను చప్పున లేచి పైకి జరిగి....

"దానికేం....రా!" అంటూ ఆమె తలను తీసుకుని తన విశాలమైన ఛాతీపై పెట్టుకుని ఆమె భుజం మీదుగాచుట్టి తలపైన చేయివేసి జోకొడుతూ పడుకునేవాడు.

అంతకుతప్ప వారిద్దరిమధ్యా 'అనురాగ ప్రదర్శన' ఏమీ వుండేదికాదు. ఇదివరకైతే .... నిర్జీవమైన గదిగోడలు కూడా అసూయ చెందేవి వారిని చూచి.

"నిషేధం ఏమీకాదు, రాత్రిపూట నీకెలాగూ నాబాధ తప్పటం లేదు....అందుకని...."

అయితే అతన్ని పూర్తిగా చెప్పనియ్యకుండానే ఆమె వారించింది. "ఆపండి....ఏమిటది! పనిమనిషి వుందిక్కడ" అంది తగ్గు గొంతుకతో.

పనిమనిషి గదిని వూడ్చి వెళ్ళిపోయాక ఇద్దరూ లోపలకు వెళ్ళి కూచున్నారు.

"ఇప్పుడు చెప్పండి....ఎందుకని మీరు తప్పించుకు తిరుగుతున్నారు?" అంది శారద, సోఫాలో అతని ప్రక్కనే కూచుని.

"శారదా! ఆ ప్రశ్నను నీకు నువ్వే వేసుకోవాలి....నన్ను కాదు...." అన్నాడు రాఘవ.

"అంటే? నేను మిమ్మల్ని తప్పించుకు తిరుగుతున్నానా? ఆ సంగతి మీరెలా కనిపెట్టారు?"

"నేనే కాదు. అయిదేళ్ళ కుర్రాడు కూడా తెలుసుకోగలడు దాన్ని .... ఇప్పుడిప్పుడే నా వునికిని నీవు భరించలేక పోతు న్నావు..."

"ఛ....ఏదో కాస్త కష్టం సుఖం మాట్లాడాలనివస్తే .... ఎత్తిపొడుపులూ, దెప్పులూను....ఈ జీవితానికింక సుఖంలేదు...." అంటూ రుసరుస లాడుతూ లేచి వెళ్ళిపోయిం దక్కడ్నుంచి.

ఆ మధ్యాహ్నం మూడుగంటలవేళ, రాఘవ మేడమీదనున్న తమ బెడ్‌రూంలోకి వెళ్ళాడు. ఈ మధ్య శారద తన కాలమంతా అక్కడే గడిపివేస్తోంది. ఆమె మధ్యాహ్నమంతా నిద్రపోనట్టుగా ఆమె ముఖమే చెబుతోంది. వాడిపోయి, సోలిపోయి, మంచంమీద కూచుని, అటు తిరిగి కిటికీలోంచి అవతలి శూన్యంలోనికి చూస్తున్న శారదను చూడగానే మనసు చివుక్కుమంది రాఘవకు. ఆమెపై జాలితో నిండిపోయిందతని హృదయం.

మెల్లగా ఆమె మంచందగ్గరకు నడచివెళ్ళి "శారదా!" అన్నాడు, అక్కడే నుంచుని....ఆ పిలుపులో జాలి, ఆర్ద్రత, ప్రేమ లతోబాటు రవంత భయంకూడా వుంది. ఆమె రియాక్షన్ ఎలా వుంటుందోనని.

అతన్నిచూచి ఇటు తిరిగి తలవంచుకు కూచుంది. అంతకు తప్పించి ఆమెనుండి అతనికి ఏ విధమైన రెస్పాన్సు రాలేదు.

అతను మంచంమీదనే ఆమెకు కాస్త దూరంలో కూచుని—

"శారదా! నేనొక మాట అంటాను కోపగించుకోవు గద...." అన్నాడు మెల్లగా.

"మాటకుముందు అలా అంటారేం? నేను మీ కళ్ళకు రాక్ష సిలా కనబడుతున్నానా?"

"లేదు. ఆగ్రహించిన దేవతలా కనబడుతున్నావు."

"ఎవరిమీద ఆగ్రహిస్తే ఎవరు వూరుకుంటారు?"

"పనిమనుషులు, నీ చేతిక్రింద పనిచేసే సిబ్బంది. ఎందుకో తెలుసా? వాళ్లు నీ మోచేతిక్రింద నీళ్ళు త్రాగేవారు-నీ కెదురు తిరి గితే వాళ్ళకు ఆ నీళ్ళుకూడా వుండవు—రెండోది నేను"

మిగిలిందని ?" అమె చిరుగ్గా తలెత్తి చూసింది.

"నేనూ అంతే. దాదాపు మన పెళ్ళయిన దగ్గర్నుంచీ ఇక్కడే పడితింటున్నాను. నీ కోపతాపాలకూ, నిర్లక్ష్యానికీ తల వంచి వుండకపోతే నాకూ అదేగతి పడుతుంది."

"అది చెప్పడానికేనా వచ్చారు ?"

"అదికాదు....నేను వారిలా పడివుండలేనని. నా రూపం ఎంత మొరటుది, వికారమైనదీ అయినా నా హృదయం అంత సున్నితమైనదీ, సుందరమైనదీనని...."

"అయితే ?...."

"దాని గౌరవాన్ని నిలబెట్టుకోవాలంటే నేనిక్కడ్నుంచి వెళ్ళిపోనైనా పోవాలి....లేదా నేను ఇక్కడ తింటున్న తిండికోసం 'నెలకి ఇంత' అని మూల్యమైనా చెల్లించాలి....అదీ గాకపోతే మూడోది, నిన్ను నాతో మా యింటికి తీసుకునైనా పోవాలి"

"మిమ్మల్ని పోషించలేనంత హీన స్థితిలో లేం మేము"

"కాని మీచేత పోషింపబడేంత హీనస్థితిలో నేనూ లేను... పోతే ప్రేమ, నీ విషయంలో గ్రుడ్డిదైతే నా విషయంలో సిగ్గుమాలినదైంది. అందుకే ఎంత నిరాదరణ ఎదురైనా ఈ స్థలాన్ని విడిచిపెట్టి పోలేకపోతున్నాను."

"నేనేమీ మిమ్మల్ని గ్రుడ్డిగా ప్రేమించలేదు."

"నువ్వు నన్ను నిజంగా ప్రేమించలేదు శారదా! లేదు. భ్రమించావ్....ప్రేమించాననుకుని భ్రమించావ్. నామీద గల ఆకర్షణని ప్రేమ అనుకున్నావ్."

"ఆపండక్కడితో....మీరన్నదంతా అబద్ధం-ఆధారం లేని నింద. మీదంతా వట్టి ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్! అందరూ కలిసి మిమ్మల్నేదో అవహేళన చేస్తున్నారని మీరే భ్రమిస్తున్నారు."

"కానీ నేనే భ్రమిస్తున్నాను. నా రూపం వికృతంగా వుంది కాబట్టి నన్ను నేను తక్కువగా అంచనా కట్టుకుని బాధపడుతున్నాను. అవును శారదా! నా కిదంతా భ్రమగానే వుంది. కన్నతల్లి చేత తప్ప లోకంలో అందరిచేతా తిరస్కరింపబడిన, అపహాస్యం చేయబడిన నన్ను ఒక అందాల సుందరి వలచి వచ్చి చేపట్టడమేమిటి? అద్దంలో నా రూపును చూస్తే నాకే అసహ్యం కలుగు

తుందే. అటువంటిది ఆమెకు నాలో ఏమందం కనబడిందని ? ఇదంతా దైవ ఘటన కాకపోతే, దేవుడికి ఏమీ తోచక నాతో ఆటలాడుకోవటం కాకపోతే ఏమిటిది? ఎందుకిలా జరిగింది? ఇప్పు డనిపిస్తోంది శారూ! మా అమ్మతో బాటు నేనుకూడా పోతే ఎంత బాగుండేదని" ఉప్పెనగా వస్తున్న దుఃఖాన్ని వుద్రేకాన్ని అతి కష్టంమీద ఆపుకుంటున్నాడతను.

చిత్తరువులా వుండిపోయిందామె, అతని మాటలు వింటూ. అతని నోటివెంట వచ్చే ప్రతీమాటా, మాటలోని ప్రతీ అక్షరం ఆమె హృదయపు లోతుల్లోకి చొచ్చుకుని పోతున్నాయి. ముఖ్యంగా అతని ఆఖరి వాక్యం ఆమెను తీవ్రంగా కదల్చివేసింది. తలెత్తి ఆందోళనగా చూసిందతని వైపు.

అంతే... ఆ చూపే అతన్ని బలంగా లాక్కుంది ఆమె వైపు. ఎన్నో రోజులనుంచీ పేరుకుని పోయిన సంకోచాన్నీ, భయ సందేహాలనూ విదుల్చుకుని వెళ్ళి పసిపాపలా ఆమె వడిలో వాలిపోయాడు-"శారూ! నా ప్రాణం! నన్ను నీనుంచి తోసెయ్యకు" అంటూ.

"ఎవరు తోసేది నిన్ను ?! నేనా ! నా ప్రాణానివి! నిన్ను తోసెయ్యగలనా ఇక్కడ్నుంచి! వొద్దులే అక్కడే! పడుకో! అలాగే అలాగే బజ్జో నా చిట్టీ" ఆమె ఒక చేతివ్రేళ్ళు అతని భుజాన్ని నొక్కిపట్టగా, ఇంకొక చేతివ్రేళ్ళు అతని కన్నీటిని తుడిచి చెక్కిళ్ళ మీదుగా, ఫాలభాగమ్మీదుగా వెళ్ళి, అతని జుత్తుని వొడిసి పట్టు కున్నాయ్.

* * *

చాలారోజుల తరువాత, ఆరాత్రి తొలిరేయినాటి ఆనందాన్ని అనుభవించారు వారు. ఆనందాన్నీ, అనురాగాన్నీ అనుభవాలతో కలబోసుకుని ఆ మధురామృతాన్ని తనివితీరా గ్రోలి, సోలి ఒకరిపై నొకరు పడి ఏ రాత్రికో నిద్రపోయారు వారు.

హఠాత్తుగా రాఘవకు ఒక రాత్రివేళ మెలకువ వచ్చింది.

బయట పుచ్చపువ్వులా వెన్నెల. ఆ వెన్నెట్లో నగ్నంగా స్నానమాడుతున్న ప్రకృతి కాంత కవ్విస్తోందతని కవితా హృద యాన్ని. చాలారోజుల తర్వాత అతనిలోని కవి మేల్కొన్నాడు.

గబగబా వెళ్ళి, టేబుల్ ముందు కూచుని లాంపు వేసి కలాన్ని, కాగితాలనీ తీసాడు.

ఒకటి, రెండు, మూడు గంటలు గడిచాయి.

అప్పటికే తూర్పున వెలుగు రేఖలు వుదయించి వెన్నెలను తెల్లబోయేట్టు చేస్తున్నాయ్. కిటికీలోంచి దూసుకువచ్చే ప్రభాత పవనాలు మనసుకీ, శరీరానికీ ఎంతో హాయిని కలుగజేస్తున్నాయ్. కాస్సేపు అలా బైటకు వెళ్ళివద్దామని లేచాడు.

గది తలుపు తెరచుకుని నైట్ గౌనులో బయటకు వచ్చిన రాఘవకు అప్పుడే మేడమెట్లు ఎక్కి వచ్చిన సుభద్రమ్మ కనుపించింది, ఒక్క క్షణం ఆగిపోయాడు.

ఆమె పరాకుగా మెట్లెక్కి వస్తూ ఆ మసక చీకట్లో నైట్ గౌనులో నుంచునివున్న రాఘవను చూడగానే ఒక్కసారిగా తృళ్ళిపడి చడుసుకుని కెవ్వున కేకవేసింది, వెనుకడుగు వేస్తూ.

అంతే!

వెంటనే బ్యాలెన్స్ తప్పిపోయి, మెట్లమీంచిజారిపడి, క్రిందకు దొర్లుకుంటూ పోయింది.

*　　　　*　　　　*

సుభద్రమ్మకు బలమైన దెబ్బలే తగిలాయి. వారం పది రోజుల వరకూ మంచంలోంచి కదలకూడదన్నాడు డాక్టరు. ఉదయం తెలివి తప్పిపోయిన సుభద్రమ్మకు మధ్యాహ్నం మూడుగంటల వరకూ తెలివిరాలేదు. శారద అంతవరకూ అన్నం నీళ్ళూ మాని తల్లిప్రక్కనే కూచుంది. ఆమె ఈ లోకంలో లేదు. కంటికీ మంటికీ ఏకధారగా ఒకటే కన్నీరు ఆమెకు. ఎవరెంత వోదార్చినా ఆమె లేవలేదు. ఆమె బాధ చూస్తోంటే రాఘవకు గుండెలు పిండినట్టయింది. అతనుకూడా ఆమెను బ్రతిమాలాడు....లేచివచ్చి కాసిని పాలైనా తీసుకోమని. కాని ఆమె వినలేదు. అసలు ఎవరివైపూ కన్నెత్తి చూడలేదు. హాస్పిటల్ బెడ్ మీద అచేతనంగా పడివున్న తల్లివైపే చూస్తూ, దీనంగా రోదిస్తూ వుండిపోయింది. అదిచూస్తుంటే రాఘవకు గుండెలు భేజారెత్తాయి. అసలు, సుభద్రమ్మ ఎలా పడిపోయిందో తనకు తప్ప ఎవరికీ తెలీదు. తీరా సుభద్రమ్మకు తెలివి వచ్చి తనెందుకు పడిపోయిందో అందరికీ విడమరచి చెబితే, వారి

ముందు తన పరిస్థితి ఏమిటి? ముఖ్యంగా తల్లికోసం అంత బెంగేలు పడిపోతున్న శారద తనను క్షమిస్తుందా? "భగవాన్! చాలారోజుల తరువాత నిన్ననే కదా నా జీవితంలో వసంతం! మళ్ళీ ఈ గ్రీష్మ తాపం ఏమిటి? ఈ యింటిలో ఎవరు క్షమించకపోయినా, ఇంకెవరు నిరాదరించినా ఈ శారద అనే దేవత నన్ను క్షమిస్తే చాలు; ఆమె ఎప్పటిలా ఆదరిస్తే అదే నాకు పదివేలు" మనసులోనే భగవంతుడ్ని వేడుకున్నాడు.

ఆ మధ్యాహ్నం మూడుగంటలకు తెలివి వచ్చింది సుభద్రమ్మకు. తల్లి కళ్ళు విప్పగానే అడిగింది శారద-"ఎలా వుందమ్మా!" అని.

"అసలెలా పడిపోయావమ్మా!" అన్నాడు రామయ్య, చెల్లెలి ప్రక్కనే కూచుంటూ.

సుభద్రమ్మ మూలుగుతూనే జరిగిందంతా వివరించి చెప్పింది అందరికీ. అందులో రాఘవను నేరుగా నిందించకపోయినా జరిగిన దానికంతటికీ రాఘవే బాధ్యుడన్నట్టుగావుంది.

ఆమె చెబుతున్నంతసేపూ న్యాయమూర్తి తీర్పును వింటున్న ముద్దాయిలా నిలబడ్డాడు రాఘవ, తలవంచుకుని

అందరూ రాఘవనే చూస్తున్నా శారద మాత్రం అతనివైపు చూడలేదు సరిగదా, తలను కూడా అటు త్రిప్పలేదు. తలవంచుకున్నా వోరకంటితో ఆమెనే గమనిస్తున్న ముద్దాయి, అది మరింత భయం గొల్పింది.

"క్షమించండత్తగారూ! మీరా సమయంలో అటు వస్తారనుకోలేదు" అన్నాడు అవమానంతో, సిగ్గుతో, సగం చచ్చిపోతూ— రాఘవ.

"నేను మాత్రం అటువద్దామనుకున్నానా నాయనా! అన్నయ్య పొద్దుటే వూరికెళ్ళాలి, లేపమంటే మేడమీదవున్న వాడి గదికి వెడుతున్నాను. ఆ సమయానికే నువ్వక్కడికి వస్తావంటే నే నటువచ్చేదాన్నే కాదు."

ముద్దాయి తప్పు వప్పుకున్నా జడ్జిగారు కనికరించలేదు. తన తరఫున వాదిస్తారనుకున్న 'లాయరు'గారు కూడా జడ్జిగారి ఆరోపణలు వింటూ మౌనంగా వుండిపోయారు. ఈ పరిస్థితికి ప్రాసి

క్ష్యాషన వారు మాత్రం సంతృప్తిగా నిట్టూర్చారు.

రాఘవ వంట్లో రక్తం గడ్డగట్టుక పోయిందా అనిపించింది. శిలలా నుంచుండి పోయాడక్కడే.

"మీరిక్కడనుంచి వెళ్ళిపోండి!"

చిన్నగా అన్నా, గంభీరంగా వినిపించాయ్ శారద మాటలు. ఆమె తల వంచుకునే, భర్తనుద్దేశించి అన్నదామాటలు.

దెబ్బతిన్నట్టుగా చూశాడు రాఘవ! అయినా అక్కడ్నుంచి కదల్లేదు.

"మిమ్మల్నే వెళ్ళిపొండి" అని మళ్ళీ భర్తకు చెప్పి, "డ్రైవర్" అని కేకేసింది. అల్లంత దూరంలో వినమ్రుడై చేతులు కట్టుకు నుంచున్న కారు డ్రైవరు నుద్దేశించి. రాఘవ డ్రైవర్ని తీసుకుని వెళ్ళిపోయాడు.

* * *

"మీరిక్కడనుంచి వెళ్ళిపోండి! వెళ్ళిపోండి!" ఆ మాటలు చెవుల్లో గింగురు మంటూవుంటే వూరంతా పిచ్చెక్కిన వాడిలా తిరిగాడు రాఘవ, పార్కులో కూర్చున్నా అవేమాటలు, బీచ్‌లో కూచున్నా అవే మాటలు. ఎక్కడా స్థిమితంగా కూచోలేకపోయాడు. ఆఖరికి ఒక నిశ్చయానికి వచ్చి ఇంటిముఖం పట్టాడు.

అతను ఇంటికి చేరేసరికి సాయంత్రం ఆరుగంటలయింది. అంతకు గంటక్రింతమే శారదవచ్చి అతనింకా ఇంటికి రాలేదని విని, గాభరా పడింది. రాఘవకు కోపం వచ్చిందా? రాదూ మరి? ఎందుకని? తను హాస్పిటల్‌నుంచి వెళ్ళిపొమ్మంది. కాని ఇంటినుంచి కాదుగా. అక్కడ వాళ్ళందరూ అతనిదే తప్పన్నట్టుగా మాట్లాడుతూ వుంటే తను భరించలేకపోయింది. ఆ పద్మవ్యూహం నుంచి ఎలా తప్పుకోవాలో తెలియక అతను బాధపడుతూవుంటే, తను దారి చూపించింది. అంతమాత్రానికే కోపం తెచ్చుకోవాలా? ఇంతకీ ఈయన ఎక్కడికి వెళ్ళినట్టు! స్నేహితులింటికా? తనకు తెలిసి వున్నంతవరకూ అతనికి స్నేహితులెవరూ లేరు. మరి? ముకుందా పురం వెళ్ళిపోయాడా?

అలా ఆమె ఆలోచిస్తున్నంతలో వచ్చాడు రాఘవ. గబగబా ఎదురు వెళ్ళిందామె.

అతను ఒక్క క్షణం ఆగి, ఆమెవైపు చూచి మళ్లా లోపలికి వెళ్ళిపోయాడు మౌనంగా.

అతను మౌనంగా లోపలికి వెళ్ళి పెట్టెలో బట్టలు సర్దు కుంటున్నాడు, అటు తిరిగి.

శారద వెనకాలే వెళ్ళి "ప్రయాణం ఎక్కడికో తెలుసుకో వచ్చా?" అంది.

అతను ఇటు తిరక్కుండానే ముక్తసరిగా "మా వూరికి, మా యింటికి..." అన్నాడు.

ఆ ధోరణి ఆమెకు కొంత చికాకు కలిగించింది. "మీకొక వూరూ, ఇల్లూ వున్న సంగతి అందరికీ తెలుసు....కాని ఇప్పుడింత అర్ధంతరంగా ఎందుకు వెళ్ళవలసి వస్తోందని?"

ఆ మాటకు చివాలున ఇటు తిరిగాడతను.

"ఎందుకా ? ఈ యింట్లో ఇంకొక మనిషి నన్ను చూసి భయపడి కాళ్ళూ చేతులూ పెరగ్గొట్టుకోకుండా! అప్పుడా సీనులో నేను అర్ధంతరంగా బయటకు వెళ్ళవలసిన పరిస్థితి ఏర్పడకుండా" అని మళ్ళా అటు తిరిగి పెట్టె మూతను వేసి, చేత్తో పట్టుకుని యిటు తిరిగాడు.

"అయితే అంతేనా నన్ను అర్ధం చేసుకున్నది మీరు ?" అంది, ఒకవంక ఉక్రోషం, ఇంకొక వంక దుఃఖం గొంతులో పోటీ పడగా.

"నిన్నర్థం చేసుకునే మాట్లాడుతున్నాను శారదా! ఒకవిధంగా నీకు థాంక్సు చెప్పాల్సి వుంది....అక్కడ్నుంచి పొమ్మని ఆ సంకట పరిస్థితిలోంచి నన్ను తప్పించావ్....కాని, నన్ను సమర్థిస్తూ ఒక్క మాటన్నా మాట్లాడి వెళ్ళిపొమ్మంటే గర్వంగా, సంతోషంగా వెళ్ళి పోయేవాడిని....శారదా! నిన్న చెప్పాను చూశావా ? నిన్ను విడిచి వెళ్ళడమనే వూహను కూడా భరించలేనని. అయితే దానినయినా భరిస్తానుకాని, నీ తిరస్కారాన్ని, ఉదాశీనతను మాత్రం భరించ లేను. నా పట్ల నీకు ప్రేమ, ఆకర్షణ సన్నగిల్లిక ముందే నేనిక్కడనుంచి వెళ్ళిపోవాలి..." అని పెట్టె తీసుకుని రెండడుగులు వేసి ఆగి "శారదా ! నా ఆరాధ్య దేవతగా, ప్రేమమూర్తిగా నీకెప్పుడూ నా హృదయంలో స్థానముంటుంది. వెళ్ళొస్తా...."

అంటూ వెనక్కు తిరిగి చూడకుండా, తిరిగి చూస్తే ఏం ప్రళయం సంభవిస్తుందోనన్నంత దూకుడుగా, పెట్టె తీసుకుని బయటకు వెళ్ళి పోయాడు, టకటక బూట్లు చప్పుడు చేసుకుంటూ, రాఘవ.

* * *

ముకుందాపురానికి వచ్చినాకూడా అతనికి మనశ్శాంతి లభించ లేదు. నిందలనుంచీ, ఇబ్బందికరమైన చూపులనుంచీ తప్పించుకున్నా, శారద జ్ఞాపకాల నుంచి తప్పించుకో లేక పోయాడతను. ఎక్కడ నుంచున్నా, ఏ పనిచేసినా శారదే కట్టెదుట నిలబడుతోంది. ఆ యింట్లో అదివరకు శారదా తనూ కలిసి వారం రోజులు గడిపారు. ఆ వారం రోజులూ ఎడారివంటి ఆ యింట్లో నందనవనం వెలిసినట్లయింది. మరీ చివరి నాలుగు రోజులూ నరసయ్య కుటుంబాన్ని పంపివేసి శారదే ఇంటిపనీ, వంటపనీ చేసుకుంది. అవి మరీ మధురమైన క్షణాలు, మరపురాని ఘడియలు. ఆ క్షణాల్ని నెమరు వేసుకుంటూ, ఆ మధుర స్మృతుల్ని గుర్తుచేసుకుంటూ యిల్లంతా కలియదిరిగేవాడు రాఘవ.

ఇక్కడ గడిపిన ఆనాటి రాత్రులు, పెరట్లో నూతి చప్టా ప్రక్కను, నందివర్ధనం చెట్టుక్రింద మల్లెపూవులాంటి ప్రక్క పై పడుకున్నప్పుడల్లా, ప్రతీ రాత్రి మొదటిరోజున చేసినట్టుగానే బాస చేసేది, ఈ చేతిని వదలననీ, ఈ స్థానం నుంచి తప్పించననీ....

అటువంటిది ఏమైందీనాడు ?

గిర్రున తిరిగి అఖాతంలోకి పడిపోయినట్టనిపించింది రాఘవకు.

చివరికి ఒకరోజు ఇవన్నీ గుర్తుచేస్తూ నాలుగు పేజీల ఉత్తరం రాశాడు శారదకు. అడుగున,

"నువ్విక్కడకు వచ్చేయ్ శారదా! ఆ మధురమైన క్షణాల్ని మళ్ళా మన స్వంతం చేసుకోవచ్చు. నీ రాకకు, వస్తున్నాననే నీ జాబుకు వెయ్యి కళ్ళతో (చాలవేమో) ఎదురు చూస్తుంటాను" అని వ్రాశాడు.

అయితే ఆ వుత్తరం శారదకు చేరలేదు. చేరలేదనే కన్నా సుందరం చేతుల్లోకి చేరి తప్పించుకోలేక పోయింది.

దాని తర్వాత రెండు వుత్తరాల గతీ అంతే....

వెళ్ళిన దగ్గర్నుంచీ రాఘవ దగ్గర నుండి వుత్తరాలు లేక పోవటంతో శారద కూడా ఒకటి రెండు వుత్తరాలు వ్రాసింది.

లంచం మరిగిన నౌఖర్ల చేతిలో పడిపోయిన ఆ వుత్తరాలు కూడా రాఘవని చేరలేకపోయాయి.

ఉత్తరాలు లేక యిటు రాఘవ, అటు శారద కూడా ఖిన్నులయినారు. బాధపడ్డారు. చివరికి ఒకరి నొకరు అపార్థం చేసుకున్నారు.

"హుం!....నిన్ను విడిచి వెళ్ళడమనే వూహనే భరించలేనననే మనిషి ఎంతలా మారిపోయారు? ఇదంతా కోపమే కాబోలు. ఎవరో అన్న దానికి చేసిన దానికి నేనేం చేస్తాను. అయినా ముందే చెప్పానతనికి, ఇవన్నీ ఎదుర్కోవలసి వస్తుందని. వాళ్ళ మీద కోపం నా మీద చూపెడితే ఎలా? అయినా ఎవరి భావాలు వారివి. ఎవరి ఆశలు వారివి. నా బిడ్డ అందంగా వుండాలని నేనాశించటం తప్పా? అసలే కాళ్ళూ, చేతులూ విరిగి బాధలో వున్న అమ్మని అతని ముందు ఏమీ అనలేదని అలక. అంతమాత్రాన అతన్ని అలక్ష్యం చేసినట్లెలా అవుతుంది? అతని రూపాన్ని అసహ్యించుకున్నాననుకుంటే దానికి నేనేం చేసేది? పోనీ అక్కడే వుండనీ. ఆయనకు లేని బాధ నాకెందుకు? సుందరం బావ చెప్పినట్టు, ఈ నాలుగు రోజులూ చీకూ చింతా మరచిపోయి, హాయిగా ఆనందంగా వుంటే కడుపులో పాపాయేనా బాగు పడుతుంది. అది నిజమేనేమో, కళ్ళకు అందంగా కనిపించే దృశ్యాలూ, మనసుకు ఆహ్లాదం కలిగించే వాతావరణం కడుపులో బిడ్డని అందంగా తీర్చిదిద్దుతాయేమో. ఆయన ప్రక్కన లేకపోతే బాధే కాని,కొన్నాళ్ళు పుట్టబోయే పాప కోసమైనా, ఆయన వియోగాన్ని భరించాలి"

ఇదీ శారద వరస....

"రమ్మని వుత్తరం రాసినా రాలేదే. కనీసం జవాబైనా రాయలేదే. శారద ఎందుకిలా మారిపోయింది. ఏమో నేను లేని వాతావరణమే బాగుందేమో అనుకుని, అసలు నా ముఖం చూడాలని లేదేమో. చూస్తే కడుపులో పాపాయి గుర్తుకు వస్తుంది. మళ్ళా బాధ, క్షోభ, ఎందుకొచ్చిన గొడవ, చూడకుండా వుంటే బాగుంటుందనుకుని వుంటుంది. అందుకే వుత్తరం కూడా రాయలేదు. పోనీ,

అలాగైనా సుఖ పడనీ, హాయిగా వుండనీ, మధ్యన నేను వెళ్ళి ఎందుకు పాడుచెయ్యాలి, ఆమె హాయినీ, ఆనందాన్నీ. ఆ ఆనందం తోనైనా పండంటి పాపాయిని కంటుందేమో, అటు వంటప్పుడు నా ఉత్తరం కూడా ఆమె కళ్ళ బడకూడదు !"

ఇవీ రాఘవ ఆలోచనలు. అందుకే అతను ఉత్తరం కూడా వ్రాయటం మాని వేశాడు. శారదకు తన మనసును ఆమె జ్ఞాపకాల నుంచి మళ్ళించడానికి, మళ్ళా క్రొత్త నవల మొదలు పెట్టాడు.

అక్కడ శారద మాత్రం వున్న కేసులు కూడా వదులు కొనటంతో చేసే పనిలేక, పగలల్లా ఏవో పుస్తకాలతో గడిపి వేసేది. లేకపోతే పబ్లికేషన్‌కి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్త రాలతో, అచ్చాఫీసు వ్యవహారాలతో కాలం వెళ్ళబుచ్చేది. రాఘవ తర్వాత నవల ఏదీ ఇవ్వక పోవడంతో ప్రెస్సుకి పని ఏమీ లేకుండా పోయింది. వర్కర్లకి జీతాలు మాత్రం ఏ నెల కానెల ఇవ్వాల్సి వచ్చేది. ఒక విధంగా ప్రెస్ నష్టంతోనే నడుస్తోందని చెప్పాలి.

"ఇలా వుంటే కొన్నాళ్ళకు ప్రెస్‌ని మూసేయాల్సివస్తుంది" అన్నాడు సుందరం ఒకనాడు.

"ఎందుకు మూయాలీ ? ప్రెస్‌లో మన స్వంత పనులే చేసుకోవాలనేముంది ? ఇతరుల పనులు కూడా చేసి పెడదాం. పైగా పత్రికల్లో చాలా సీరియల్సు పడ తున్నాయ్. వాటిల్లో కొన్ని చాలా బాగున్నాయ్ కూడాను. వాటిని అడిగి పబ్లిష్ చేద్దాం" అంది శారద.

సుందరం నవ్వాడు.

"మన చేతిలో ఇంత మంచి రైటర్‌ని వుంచుకుని వాళ్ళనీ వీళ్ళనీ అడగాలా ?" అన్నాడు.

"ఆయన మంచి రైటరే. సందేహం లేదు అయితే అంత మాత్రంచేత తక్కిన వారిలో మంచి వారు లేరని ఎలా అనగలం? అయినా ఆయన క్కూడా వుత్తరం రాయి. త్వరలో మంచి నవల ఒకటి రాసి పంపమని."

"అది నవ్వే వ్రాస్తే బాగుంటుందేమో శారదా !"

"ఫర్వాలేదు, ఎవరు వ్రాసినా వకటే. అంతగా అయితే

అఫిషియల్‌గా రాయి. నేను సంతకం పెడతా" ఆమెకు రాఘవ పైన కోపం ముంచుకు వస్తోంది, వుత్తరాలు రాయనందుకు.

* * *

"శ్రీయుతులు మన్మథ గారికి :

ఈ యేటితో మా ప్రచురణ సంస్థకు పాతిక సంవత్సరాలు నిండుతాయి. ఇన్ని సంవత్సరాలుగా మీ వంటి వుత్తమ రచయితల ఆదరాభిమానాలతో వుత్తమ గ్రంథాలు ప్రచురించి, తెలుగు సాహితీమతల్లికి ఏదో వునతా భక్తిని సేవ చేశాం. ఈ సిల్వర్ జూబిలీ సందర్భంగా ఉత్తమ రచయితల గ్రంథాలు నాలుగు ప్రచురింప దలచుకున్నాం. వారిలో మిమ్మల్ని వొకరుగా ఎన్నుకున్నాం. అందువలన దయయుంచి ఈ నెలాఖరులోగా మీరొక నవలను వ్రాసి పంపగలరు. మీ జవాబుకు ఆతృతతో ఎదురుచూస్తూ

—మీ శ్రేయోభిలాషులు

ఆ ఉత్తరాన్ని చదువుకున్నాడు రాఘవ.

అవును. తన పుస్తకాల్ని ఎక్కువగా ప్రచురించి తనకు ఎక్కువ ప్రతిఫలాన్ని ముట్టజెప్పిన వారిలో వీరొకరు. ఈ శుభ సమయంలో వీరికి తప్పక ఒక నవల వ్రాసి పంపవలసిందే అని నిర్ణయించు కున్నాడు. వెంటనే తన సమ్మతిని తెలియపరుస్తూ వారికి జాబు రాసిపడేశాడు.

ఆ మర్నాడే శారదా పబ్లికేషన్స్ నుంచి వుత్తరం వచ్చింది.

పైన కంపెనీ అడ్రస్ వున్నా, శారదే వ్రాసి వుంటుందని ఆతృతగా కవరు విప్పాడు రాఘవ.

తీరా చూస్తే లోపల టైపు చేసివున్న ఆఫీసు వుత్తరం. తమ పబ్లికేషన్‌కి త్వరలోనే ఇంకొక నవల వ్రాసి పంపమని దాని సారాంశం. క్రింద శారద సంతకం వుంది. ఆ వుత్తరాన్నీ, ఆ సంతకాన్నీ చూస్తూ కొద్దిసేపు అలాగే వుండి పోయాడు.

శారద ఎంత మారిపోయింది !

తనతో ఆఫీసు పరంగా తప్ప ఇంకే విధమైన సంబంధం కాని, అనుబంధంకాని లేవాఆమెకు ? మనిషిదూరమైతే మర్చిపోయే ప్రేమేనా ఆమెది? తనిక్కడకు వచ్చిన తరువాత రెండు నెలలకు వచ్చిన ఉత్తరం ఇది, అదీ ఆఫీసు వుత్తరం. తనకింత కన్న

ఎక్కువ ఉత్తరం రాయకూడదను కుందా?

ఈ ఉత్తరానికి తగినట్టుగా జవాబు వ్రాస్తే? ఎందుకు రాయాలి? తనకేనా పౌరుషం, అభిమానం లేనివి? తనూ అఫీషియల్‌గానే రాస్తాడు.

రాఘవ ఆ మర్నాడే రాసి పడేశాడు. ప్రస్తుతం వ్రాస్తున్న నవలను ఇంకొకరికి ఇవ్వటానికి ఇదివరకే ప్రామిస్ చేశాననీ, అందువల్ల ప్రస్తుతం ఏమీ నవలను ఇవ్వలేననీ—

ఆ ఉత్తరాన్ని చూసుకుని శారద మండి పడింది.

ఎంత అహంకారం! కేవలం తన రచనలు ప్రచురించటానికే ఏర్పడిన పబ్లికేషన్ కివ్వకుండా ఇంకొకరి కిస్తాడా తన రచనలను? కావాలని అడిగినందుకు ఈ తిరస్కారం.

ఆ వుత్తరాన్ని చదువుతున్నంతసేపూ శారదనూ, ఆమె ముఖ కవళికలనూ గమనిస్తూన్న సుందరం, ఆమె వుత్తరం చదివి క్రింద పెట్టి దీర్ఘంగా నిట్టూర్చాక అడిగాడు—

"ఏం శారదా! ఏం రాశాడు మీ ఆయన...."

"ఆయన కూడా అఫిషియల్‌గానే జవాబిచ్చారు...." అంది.

'అది తెలుస్తూనే వుంది. అందుకేగా ఈ వుత్తరం నీ చేతి వరకూ వచ్చింది.' అనుకుని నవ్వుకున్నాడు సుందరం, మనసులోనే.

ఆమె చాలా సేపటివరకూ మాట్లాడలేదు. నిశ్చలంగా, తీక్షణంగా శూన్యంలోనికి చూస్తూ వుండిపోయింది—కొంత సేపటి తరువాత దృఢంగా, నిశ్చయంగా వచ్చాయి ఆమె నోటి వెంట మాటలు.

"బావా! ఈ రోజునే ఆయనకు వుత్తరం రాయి—కేవలం మీ రచనలు ప్రచురించడానికే ఈ పబ్లికేషన్ స్థాపించామనీ, ఈ ప్రెస్‌ని కొన్నామనీ—అటువంటిది ఇప్పుడు మీరు రచనలు ఇవ్వక పోతే మేం పెట్టిన ఈ పెట్టుబడి అంతా వృధా అయిపోతుందనీ, ఆర్థికంగా చాల నష్టం వస్తుందనీ, అసలిప్పటికే నష్టంతో నడుస్తోందనీ, ఆయనకు రాయి."అంది శారద టేబుల్‌పైన పేపర్ వెయిట్‌ని గిర గిరా త్రిప్పుతూ. అలా దానిని త్రిప్పే ఆమె వ్రేళ్ళ కదలికలే చెబుతున్నాయ్—ఆమె మనసులో చెలరేగే కల్లోలాన్ని....

* * *

శారదా పబ్లికేషన్స్ నుంచి వచ్చిన రెండో వుత్తరాన్ని అందుకున్నాడు రాఘవ. అటువంటి వుత్తరం తనకు ఎప్పుడో అప్పుడు వస్తుందని తెలుసు. కాని అది ఇంత త్వరగా వస్తుందనీ, దానిపైన శారదే స్వయంగా సంతకం పెడుతుందనీ అనుకోలేదు. హుఁ....ఎంతలో ఎంత మార్పు!....ఇదంతా తనను సాధించటానికే చేస్తోంది శారద....ఈ విధంగా ఇరకాటంలో పెడితే సరెండర్, అవుతాడని కాబోలు ఆమె వుద్దేశం!.... అవును. తను తప్పక సరెండర్ అవుతాడు—కాని ఆమె ధనానికీ, అది తెచ్చిన అహానికీ కాదు, ఆమె ప్రేమకు, అనురాగానికి .... అదే తెలియజెప్పాలి ఆమెకు.

ఒక రోజంతా దీర్ఘంగా ఆలోచించిన తరువాత ఒక నిర్ణయానికి వచ్చాడు అతను.

వెంటనే ఉత్తరం రాశాడు.

అనుకున్నట్లుగానే వారం రోజులు పోయాక శారద వాళ్ళ వూరుబయలుదేరి వెళ్ళాడు. అతనువెళ్ళేసరికిసాయంత్రం అయిదయి పోయింది. ఆఫీసు పని మీద వెళ్ళినవాడు ఆఫీసు అవర్సులోనే వెళ్ళాలి కాబట్టి, ఆ రాత్రికి ఎక్కడైనా గడిపి మర్నాడు కంపెనీకి వెళ్ళాలని నిర్ణయించుకున్నాడు.

అయితే రాత్రికి ఎక్కడ గడపాలి?....తనకు తెలిసినవాళ్ళు ఆటౌన్‌లో, ఎవరూ లేరు.

అతను హోటల్‌కి వెళ్ళి సామాన్లు అక్కడ పెట్టుకుని స్నానం చేశాడు....మానసికంగా శారీరకంగా అలసిపోయిన అతనికి కొంత రిలీఫ్ కలిగింది.

రాఘవ, మర్నాడు ఉదయం తొమ్మిదిన్నరకు వెళ్ళాడు శారదా పబ్లికేషన్స్‌కు. రాఘవ వెళ్ళేసరికి శారద వొక్కర్తే వుంది ఆఫీసులో. సుందరం, రామయ్యా ప్రెస్‌కి వెళ్ళిపోయారు. సుభద్రమ్మ వంటగదిలో వుంది.

"లోపలికి రావచ్చునా?" అన్నాడు రాఘవ, గుమ్మం దగ్గరే నిలబడి—కుర్చీలో కూచుని ఏదో పుస్తకం తిరగవేస్తున్న శారదను చూచి.

ఆ మాటకు ఠక్కున తలఎత్తి చూసింది, ఆమె. ముఖంలో

ఎటువంటి భావమూ కనబడనీయక ద్వారం వద్దనే నుంచున్నాడు రాఘవ. చేతిలో ఒక బ్రీఫ్ కేసు వుంది.

కొన్ని క్షణాలు అలాగే అతని ముఖంలోకిచూచి, పొంగి వచ్చే వుద్వేగాన్ని అణుచుకుంటూ—

"రావచ్చు....రండి!" అంది పొడిగా — కుర్చీలోంచి ముందుకు జరిగి.

రాఘవ వచ్చి ఆమె కెదురుగా బల్లకటువైపు నుంచున్నాడు.

"నేను మీ సంస్థకు నా రచనలేమీ ఇవ్వలేనంటూ, ఆ కారణంవల్ల మీ కంపెనీకి, ప్రెస్‌కి చాలా నష్టం వస్తుందంటూ మీరు పంపిన అల్టిమేటమ్ అందింది." అన్నాడు రాఘవ, ఆమె చూపిన కుర్చీలో కూర్చుని.

"దాన్ని మీరు అల్టిమేటమ్‌గా ఎందుకు తీసుకోవాలి? విజ్ఞాపనగా ఎందుకు తీసుకోకూడదు?" అని ప్రశ్నించింది శారద.

"విజ్ఞాపనలో, నిందా ధోరణులూ, బాధ్యతనంతా ఎదుటి వ్యక్తిపై త్రోసివేసే భావంతో వుండవు...."

"అయితే నిజంగా మీకీ సంస్థలోగానీ, ప్రెస్‌లోగానీ, బాధ్యత లేదంటారా?"

"ఆ సంస్థ మీది....అందులో నా రచనలు కాకపోతే ఇంకెవరి రచనలైనా ప్రచురించే హక్కు మీకుంది...."

"సంబంధం లేదన్నంత మాత్రాన సరిపోతుందా? మరి ప్రెస్ సంగతి ఏమిటి? మిమ్మల్ని నమ్మి దానిమీద పెట్టుబడి పెట్టాం.... ఇప్పుడు పనిలేక వర్కర్సు అందరూ గోళ్ళు గిల్లుకుంటూ కూచున్నారు."

"ప్రెస్‌కి పని లేకపోటానికి నా బాధ్యత ఏమీలేదు. పోతే మీరు దానికి పెట్టుబడి పెట్టలేదు. నేను ప్రెస్‌ను పెట్టుకుందికి నాకు అప్పు యిచ్చారు. దానికి నేను నోటుకూడా రాశాను. గుర్తుందా?"

"ఆ....వుంది ...అయితే?"

"ఇప్పుడా బాకీని తీర్చి, నోటును చెల్లు చేసుకుంటాను. ప్రెస్‌ని నా ఆధీనం చెయ్యండి."

"అంత డబ్బు మీకెక్కడిది?" అంది.

"అది నా స్వంత విషయం...." అని తక్షణం జవాబు

చెప్పాడతను. ఆమె ఖంగు తిన్నట్టుగా చూసి మళ్ళా సర్దుకుని—

"సరే మీ నోటుని ఇప్పుడే యిచ్చివేస్తాను" అంది డ్రాయరు సొరుగు లాగి, అందులోంచి ఒక ఫైలును తీసింది.

"ఇదుగో ప్రెస్ పెట్టుకుందికి మీరు నాకు అప్పుగా ఇచ్చిన పదిహేను వేలు, దీనిపైన వడ్డీ ఏమైనా వుంటే చెప్పండి. అది కూడా ఇచ్చేస్తాను" అన్నాడు, నోట్లకట్టలను ఆమె ముందుకుతోస్తూ.

"మేమేమీ వడ్డీ వ్యాపారస్తులం కాదు" అందామె, వుక్రోషంగా నోట్లకట్టలను తీసుకుని, డ్రాయర్ సొరుగులో పడవేస్తూ-

"ఇదుగో మీ నోటు" అంది ఫైల్లో వున్న నోటునితీసి అతని ముందుకు తోస్తూ.

దాని నతడు తీసుకుని "థాంక్స్! అయితే ప్రెస్‌ని ఈరోజు నుంచే నా స్వాధీనం చేస్తారా?" అన్నాడు.

"ప్రెస్ మీ పేరనేవుంది" దానిని మీకు వేరే స్వాధీనం చేసే ప్రసక్తిలేదు" అంది శారద, ఎటో చూస్తూ.

"స్వాధీనం చెయ్యడమంటే నా వుద్దేశం అందులో మీవాళ్ళు ఎవరూ వుండకూడదని" అన్నాడు రాఘవ.

"అయితే మీరు ప్రెస్‌ని మూసివేస్తారా? కారణం?" అంది.

"అది కేవలం నా స్వంత విషయం. అయినా అడిగారు కాబట్టి చెబుతున్నా. వాళ్ళని ఖాళీ చేయించి అందులో నేను మకాం పెట్టబోతున్నా."

అతను ప్రెస్‌లో వర్కర్స్‌ని తీసివేయ మనటమే గాకుండా, అందులో తను మకాం కూడా పెట్టబోతున్నాడనేసరికి ఆమెకు కోపం, బాధ ముంచుకొచ్చాయి.

"అదేమిటి! ఇల్లూ వాకిలీ లేనివారిలా ఆ ప్రెస్‌లో కాపురం పెట్టడమేమిటి?" అంది.

"కరెక్టుగా చెప్పావ్. నాకు ఇల్లూ వాకిలీ లేకపోవటమే కారణం."

"అంటే?" అందామె అయోమయంగా.

"ఔను. నాకు యిల్లూ వాకిలీ లేవు. నీ అప్పును తీర్చటానికి అవి అమ్ముడైపోయాయి." నిదానంగా చెప్పాడు రాఘవ.

ఆమె షాక్ తిన్నట్టుగా చూసింది.

"అంటే .... మీరు మీరు .... ముకుందపురంలో ఇంటినీ, భూమినీ అమ్మేశారా?" అంది నీరసంగా.

"అవును. నావల్ల మీ కంపెనీకి, పెట్టుబడికి నష్టంలేకుండా వుండాలంటే అంతకన్నా వేరేమార్గం లేకపోయింది నాకు. అయినా నా బాధలేవో నేను పడతాను. ముందు మీరు ప్రెస్‌ని అప్పగించండి నాకు."

ఆ మాటలతో ఆమెకు ఒక్కసారిగా వుక్రోషం ముంచుకు వచ్చింది–"మీరు ఎవర్నడిగి చేసారావని? నేను చచ్చిపోయాననుకున్నారా?" అంది బిగ్గరగా.

"శారదా! అదేగనక జరిగితే ఈ రాఘవకి ఆస్తిపాస్తులేకాదు ఈ లోకమే అక్కరలేదు" అన్నాడు రాఘవ, ఆమె మాటలు వినగానే చలించిపోతూ.

అయితే శారద అతని మాటల్ని పట్టించుకోలేదు.

"హుం....అంత ప్రేమ వుండబట్టే కాబోలు, వెళ్ళిన దగ్గర్నుండీ ఒక ఉత్తరమైనా రాయలేదు" అంది నిష్ఠూరంగా.

"శారదా! అబద్ధాలు కూడా నేర్చావా! నువ్వు వుత్తరాలు రాయలేదు సరికదా, నేను కూడా ఉత్తరాలు రాయలేదంటావా? నేను వ్రాసిన నాలుగు వుత్తరాలూ ఏమయినై?" అన్నాడు రాఘవ.

ఏదో నమ్మలేని విషయాన్ని వింటున్నట్టుగా చూసింది శారద. "ఏమిటి? మీరు నాకు నాలుగు వుత్తరాలు వ్రాశారా? పైగా నేనే మీకు వుత్తరాలు రాయలేదా? మరైతే నేను రాసిన వుత్తరాలేమయినాయి?" అంది అయోమయంగా.

ఆమె మాటలు విని రాఘవ కూడా అయోమయంలోపడ్డాడు. "చిత్రంగా వుందే? నువ్వు నాకు వుత్తరాలు రాశావా? మరైతే అవి నాకు ఎందు[illegible]అందలేదు?" అన్నాడు రాఘవ సాలోచనగా— సంభాషణ ఈ[illegible]లుపు తిరగటంతో వారు తమ మధ్యరేగిన తగాదాను మర్చిపోయారు.

శారద వున్నట్టుండి–"అయితే నేను మీ పేరన రీడైరెక్టు చేసిన ఉత్తరాలు అందాయా?" అంది.

"అవి అందాయి. అఫీషియల్‌గా మనం వ్రాసుకున్న వుత్తరాలు [illegible]ధాయి. మరి ఇవి అందకపోవటానికి కారణం?" అన్నా

దతను—"సాధారణంగా నువ్వు వుత్తరాలు పోస్టు చేయమని ఎవరి కిచ్చేదానివి?" అని అడిగాడు మళ్ళీ.

"ఇంకెవరికి? మన అబ్దుల్లాకే -అంతేకాదు పోస్టాఫీసునుండి టపాల్ని కూడా వాడే తెచ్చేవాడు - అ -"అబ్దుల్లా!" అని కేకవేసి పిలిచింది, దూరంగా పని చేసుకుంటున్న ఆఫీసు బాయ్‌ని. వాడు ఆ యింటిలో క్రొత్తగా ప్రవేశించిన పని కుర్రవాడు. ప్రచురణసంస్థనీ, ప్రెస్‌నీ పెట్టిన తర్వాత సుందరమే వాడిని తమ వూరునించి తీసుకు వచ్చి ఆఫీస్‌బాయ్ వుద్యోగం ఇప్పించాడు.

శారద పిలిచిన పిలుపుకి- "ఏమమ్మా!" అంటూ వచ్చాడు వాడు-చేస్తున్నపనిని ఆపి.

"రోజూ టపాల్ని తీసుకువచ్చి, తిరిగి వుత్తరాలు పోస్టులో వేసేది నువ్వేకదూ?" అడిగింది శారద వాడిని.

"ఔనమ్మా! ఏం?" అన్నాడు వాడు.

"నేను ఈ బాబుగారికి వ్రాసిన ఉత్తరాలు ఆయనకు అందలేదట. అలాగే ఆయన నా పేరన రాసిన ఉత్తరాలు కూడా అందలేదు. కారణం ఏమిటి?" గద్దించి అడిగిందామె.

ఆమె అలా గద్దించి అడగ్గానే తెల్లబోయాడు వాడు..... ముఖంలో లీలగా భయం కూడా గోచరించింది.

"నిజం చెప్పు అబ్దుల్లా! ఆ వుత్తరాలని నువ్వే నేరుగా తీసుకవెళ్ళి, తీసుకువచ్చేవాడివా? లేక, దారిలో ...రికైనా యిచ్చే వాడివా?" అన్నాడు రాఘవ, గదుముతూ.

వాడు, రాఘవ కోపాన్ని చూసి ఆకులా ...కాడు.

వాడు చెప్పింది విన్నాక కొన్ని క్షణాలవర... మాట్లాడలేక పోయింది శారద. సుందరం అలా చెయ్యటం ఆశ్... తలవంపులని పించింది. కోపంతో ముఖం ఎర్రబడగా, "అతను ...నా చేస్తున్నా డని నా కెందుకు చెప్పలేదు!" అని అడిగిందివాడి...

"క్షమించండమ్మా! ఆ సంగతి ఎవరితోనైనా ...బితే ఉద్యోగంలోంచి తీసేస్తామన్నారమ్మా వారు...." అన్నాడు వాడు, మరింత భయంతో వణికిపోతూ.

శారద కొన్నిక్షణాలు వాడివైపే చూసి, "సరే వెళ్ళు...." అంది. వాడు వెళ్లిపోయాక,

"ఛ....బావ ఇంత నీచానికి వడిగడతాడని అనుకోలేదు. తన కుత్సిత బుద్ధితో ఎంత క్షోభ పెట్టాడు మనిద్దరినీ." అంది శారద బాధగా.

"ఒక విధంగా అది మంచిదే అయింది శారదా! ఆ క్షోభ అనే అగ్నిలోబడి మన హృదయాల్లో పిచ్చి పొదల్లా లేచిన అపోహలు, అపార్థాలు మాడి దగ్ధమయినాయి" అంటూ-తను కూర్చున్న కుర్చీలోంచి లేచి, టేబుల్ చుట్టూ తిరిగి ఆమె వద్దకు వచ్చి ఆమె కూర్చున్న కుర్చీహేండ్ మీదనే కూర్చుని, ఆమె చుట్టూ చేతులు వేసి—

"శారదా! ఇప్పుడు మన ఇద్దరి మధ్యా వుండవలసింది బాధలూ, క్షమార్పణలూ కాదు. ఇకముందు ఇటువంటి అపోహలు అపార్థాలూ రాకుండా చూసుకోవటం...." అంటూ వంగుని ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుని, గట్టిగా బిగించి పట్టుకున్నాడు. చాలా రోజుల తరువాత కలిగిన అతని స్పర్శకు ఆమె పులకించిపోయింది. మారు మాట్లాడలేక తన్మయత్వంతో అలాగే అతని హృదయంపై వాలిగిపోయింది.

"శారదా! మళ్ళా మనిద్దర్నీ కలిపిన ఈ క్షణం మధురమైనది-మరచిపోలేనిది. ఈ క్షణంలోనే ఇద్దరం ప్రతిజ్ఞ చేయాలి. మళ్ళీ కలిసిన ఈ చేతులు, జీవితంలో ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఎటు[illegible]టి ఝంఝామారుతాలు వీచినా, విడిపోకూడదు సరికదా; ఈ [illegible]ంపు కూడా సడలిపో కూడదని, సరేనా?"అన్నాడు, తన గుండెల[illegible] [illegible]ప్రవాలిన ఆమె నుదుటిని తన గెడ్డంతో నొక్కి-పడుతూ.

"నే[illegible] [illegible] అనను, అసలు నేనేమీ చూడను, ఇలాగే కళ్ళు మూసుకుని [illegible] భుజం మీద వాలిగిపోయి మీరు నడిపించే బాటలో మీతోబాటు [illegible]స్తాను. ఆ ప్రతిబంధకాలనీ, సవాళ్ళనీ మీరే ఎదుర్కోండి" [illegible]దామె మళ్ళీ కళ్ళు మూసుకుని.

* * *

ఆ రోజు జడ్జి కోర్టు జనంతో కిటకిటలాడి పోతున్నది. కారణం—ప్రఖ్యాత రచయిత, మన్మథపై హత్యానేరం ఆరోపణగా, [illegible]త కొంతకాలం నుంచీ నడుస్తున్న కేసులో అతనిని

నవలా

ప్రేమించి వివాహమాడిన అతని భార్య, ఆ పట్టణంలోకెల్లా లీడింగ్ లాయర్ శారదాదేవి, ప్రాసిక్యూషన్ తరపున సాక్షిగా నిలబడటమే.

ఒక బోనులో రాఘవ నుంచున్నాడు. అతని కెదురుగా ఇంకొక బోనులో శారద నుంచున్నది. రాఘవ శాంత గంభీర వదనుడై వుంటే, శారద జారిపోతున్న గాంభీర్యాన్ని నిలబెట్టుకునే ప్రయత్నంలో, నుంచున్న బోనునే గట్టిగా పట్టుకుని నుంచుంది.

పబ్లిక్ ప్రాసిక్యూటర్ లేచి శారద ముందుకు వచ్చాడు చేయవలసిన ప్రమాణాలూ అవీ చేయించిన తరువాత,

"మీ పేరు?" అని అడిగాడు.

"శారదాదేవి...." జవా బిచ్చిందామె,

"వృత్తి?"

"న్యాయవాద వృత్తి."

"అంటే సత్యం ఎంత కఠోరమైనదైనా న్యాయం వైపే వాదించాలి మీరు, అవునా?"

"అవును."

"అయితే మీ ఎదురుగా ఆ బోనులో నుంచున్న వ్యక్తిని చూడండి....ఆయన మీ కేమౌతారు?"

"ఆయన నా భర్త...."

"ప్రేమించి పెళ్ళి చేసుకున్నారా?"

"అవును...."

"మీ ప్రేమకు ప్రేరణ ఏమిటి?"

"ఆయన రాసిన రచనలు.... వాటిలో ప్రతిబింబించే వారి ఉన్నతమైన వ్యక్తిత్వం...."

"అంటే ఆయన ఎవరో, ఎలా వుంటారో తెలియకుండా కేకలు, ఆయన రచనలను బట్టే మీ రాయనను ప్రేమించారా?"

"అవును...."

"అతనెవరో తెలిసిన తరువాత కూడా, అతని రూపాన్ని చూసిన తరువాత కూడా మీలో అతనిపై గల ప్రేమ తరిగి పోలేదా?"

"లేదు...."

"మరి అంత ప్రేమ కలిగివుండి కూడా అతని మీరు

స్వయంగా హత్యానేరం ఎలా ఆరోపించారు? మీ అంతట మీరే ఆయన్ను పోలీసులకు ఎలా వప్పగించారు?"

"ఆ హత్య నా సమక్షంలోనే జరిగింది కాబట్టి. ఆ హత్యను నేను కళ్ళారా చూశాను కాబట్టి.... ఒక న్యాయ వాదినిగా నా ధర్మాన్ని నేను నిర్వర్తించాలి కాబట్టి...." అలా అంటూంటే ఆమె కంఠం వణికింది.

"ఆయన చేసిన, మీరు చూసిన ఆ హత్యాకాండ ఏమిటో వివరిస్తారా?"

సడలిపోతున్న ధైర్యాన్ని ఆమె చిక్కబట్టుకుంది. గుండెను రాయిగా మార్చుకుని, "అం....వివరిస్తాను" అంది.

"ఆ రోజు రాత్రి—అంటే నాకు ప్రసవమయిన నాటి రాత్రి ఆయన నా గదిలోకి వచ్చారు."

"ఎందుకు వచ్చారు?"

"వారి పాపను చూచుకుందికి...."

"ఆపాపను అంతకుముందు చూశారా?"

"ఆ... ఆ మధ్యాహ్నం ప్రసవమైన వెంటనే చూశారు...."

"సో....అయితే రెండవసారి మళ్ళా చూడటానికి వచ్చారన్నమాట."

"అవును...."

"అప్పు[illegible] చేశారు? అప్పుడు ఆయన ఎలా వున్నారు?"

"చాల[illegible] పడుతున్నారు. భయం, బాధ, వారి ముఖంలో స్పష్టంగా కనిపి[illegible]ాయి."

"ఎందు[illegible]"

ఈసా[illegible]మె కంఠంవణికింది — అయినా నిగ్రహించుకుని —"ముహూ[illegible]ా వారి రూపులో పుట్టిన ఆ పాపను చూచి.... ఆమె అలా[illegible]ం వల్ల మా యిద్దరి మధ్యగల ప్రేమకు విఘాతం కలుగుతుంద[illegible] నన్న భయం, కురూపిగా పుట్టిన ఆపాప ఈ లోకంలో, [illegible]క్ష్యంగా నా చేతుల్లో ఏవిధంగా పెరుగుతుందో నన్న బాధ...."

"[illegible]ధ ఎందుకు? మీకు అటువంటి పాప కలగటం మీ కిష్టం లేదా?"

"లేదు.... నేనేకాదు ఏ కన్నతల్లీ ఆ రూపంలో తనబిడ్డను చూసుకోలేదు.... అనుక్షణమూ ఆమె వికృతమైన రూపంతో తనకళ్ళ ముందు తిరుగుతూ ఉంటే ఆమెను చూసిన ప్రతీ చూపులోనూ అపహాస్యం, అసహ్యం వెల్లి విరుస్తూంటే, ఏ తల్లి భరించగలదు? ....ఆమె భవిష్యత్తు ఏమవుతుందోననే బాధను, ఏ తల్లీ జీవితాంతమూ భరించ గలదు?" ఉద్వేగం ఆవహించినదామెను.

"మీకు ఈ ఆలోచన ఆయన్ను వివాహం చేసుకునే ముందు కలగ లేదా?"

"లేదు. వారిపైగల అవ్యాజమైన ప్రేమ నన్నలా ఆలోచించ నివ్వలేదు."

"తీరా ఆ ఆలోచనమీలో కలిగిన తరువాత మీ వారిపై ప్రేమ తరిగి పోయిందా?"

"ఎంతమాత్రమూ లేదు. కాని, ఆ ఆలోచన నాలో కలిగిన తరువాత నేను బాధతో కుమిలి పోయినమాట నిజమే."

"అలా మీరు బాధపడటం వారు భరించలేక పోయారను కుంటాను."

"అవును. అకారణంగా నేను వారినుండి దూరమై పోతానేమో నని భయపడేవారు. దానికి తోడు మా యిద్దరి కలయికనూ భరించ లేని కొందరు వ్యక్తులు వారి బాధను మరింత ఎ[illegible]వ చేసేవారు. అనేక సమయాలలో మా యిద్దరి మధ్యా అపో[illegible], అపార్థాలు దారి చేసుకున్నాయ్. అయినా నిర్మలమైన దృఢ[illegible] మా ప్రేమ ముందు అవేవీ విలవలేక పోయాయ్. అప్పుడే [illegible]మిద్దరం నిర్ణయించుకున్నాం — ప్రేమైకమైన మా బ్రతుకు[illegible]లో అడ్డు తగిలిన దేనినీ లక్ష్యపెట్ట కూడదని, దేనికీ భయపడ[illegible]దని....కాని," ఆగిపోయిందామె....

"ఊఁ....కాని,...."

"ఆ నిర్ణయానికి నేనే కట్టుబడలేకపోయా[illegible] ఆ వికృత రూపంగల పాప గాలిదుమారమై, నా నిర్ణయాలను ఎ[illegible]గొట్టేసింది. అంతవరకూ ధైర్యంగా ఆయనతో నడచి నేను ఈ పాపను [illegible] భయంతో వెనకంజ వేయటంతో నేను చేయి జారి పోతానేమోనని [illegible]రు భయపడ్డారు. కడకంటా నేను వారితో ప్రయాణం చేయ[illegible]హోనని

జీపులి పోయారు. నా ప్రేమకు నోచుకోని ఆ పాప జీవితం, తన·కువితం వ్యర్థమనుకొన్నారు వారు." ఆమె కాసేపు ఆగింది.

కోర్టు హాలంతా సూది పడవేస్తే వినబడేంత నిశబ్ధంగ వుంది·

"మీరు పాపను నిరాకరించటంవల్ల వారు మీ మీద కోప గించుకున్నారా ?"

"లేదు బాధపడ్డారు, నిస్పృహ చెందారు। అదే రూపంలో తనుపుట్టి, చిన్నప్పటినుంచీ లోకంవల్ల తాను పడిన బాధలూ, పొందిన అవమానలూ, అవహేళనలూ వారి కళ్ళముందు మెదిలాయి. ఆ సమయంలో ఆయనకు వారి తల్లిప్రేమైనా దక్కింది. కాని వారి పాపకు అదికూడా దక్కలేదు. కనీసం కన్నతల్లి యొక్క కనిక రానికి కూడా నోచుకోలేని ఆ పాప దుస్థితికి వారి హృదయం పగిలి పోయింది. ఆ పాపతోబాటే తనుకూడా, నా నిరాదరణకు గురి అవు తానేమోనన్న భయం వారిని పీడించిది. పైగా పుట్టినది ఆడపిల్ల. పెరిగినకొద్దీ ఆమె జీవితం ఎంత భయానకంగా తయారౌతుందోనని కుమిలిపోయారు. ఆమె పెరిగి పెద్దదై ఆ దుర్భర జీవితాన్ని క్షణ క్షణం నరకంలా అనుభవించేకన్నా పుట్టిన వెంటనే చాలించుకుంటే మంచిదన్న నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయం వారిలో న్యాయా న్యాయాలనూ, యుక్తాయుక్త విచక్షణా జ్ఞానాన్ని రూపుమాపింది. అందుకే....అం ే..."

వుయ్యా ో నిద్రపోతున్న ఆ పాప....ఆ పాప ముఖంపై బలంగా తన రచేతిని అదిమి పెట్టారు....అంతే "బాధతో దుఃఖంతో ఆమె రువాత మాట్లాడలేకపోయింది। బోనుపై వరిగి పోయి మౌన రోధించసాగింది. ఆ సమయంలో ఆ కోర్టు హాలులో ఎం న్నో చెమర్చాయి, రాఘవ మాత్రం చలించలేదు రాగద్వేషాల తీతునిలా శిలా సదృశుడై పోయాడు.

ఆమె అలాగే కొన్ని క్షణాలు వదిలివేశాడు ప్రాసిక్యూ టరు. తరువా మెల్లగా—

" ండి శారదాదేవీ ! ఇది కోర్టుహాలు, మీరుకూడా లాయర క్కడ పాటించవలసిన నియమాలుకూడా కొన్నివుంటా యని తెలుసును....మీరు ధైర్యంగా వుండాలి· లేవండి....

తరువాత ఏం జరిగిందో చెప్పండి....." అన్నాడు ఆమెను అనునయిస్తూ.

ఆమె మెల్లగా లేచి నుంచుంది. చెక్కిళ్ళపై కారే కన్నీటిని కూడా తుడుచుకోకుండా రుద్ధమైనకంఠంతో మళ్ళామొదలుపెట్టింది....

"అది చూచి నేను స్థాణువునైపోయాను. మొదట ఆయన ఏం చేశారో నాకు అర్థం కాలేదు. కాని, నాకు అర్థమయేలోపునే అంతా ముగిసిపోయింది. ఒక్క మూలుగు మాత్రం మూలిగి నా పాప, నా రక్తంలో రక్తం ఈ లోకాన్ని విడిచి వెళ్ళిపోయింది. అంతవరకూ స్తబ్దుగా వుండిపోయిన నాలోని మాతృత్వం పాప చివరిసారిగా మూలిగిన మూలుగుతో మేల్కొంది. కళ్ళువిప్పి కన్నీరు కార్చింది. ఏం లాభం? నేను ఎంత ఏడ్చినా మొత్తుకున్నా లాభం లేకపోయింది. నా కేకలకు, ఏడ్పులకు ఇంట్లో వారందరూ వచ్చి చేరారు. ఆయన్ను ఒక భయంకర మృగాన్ని చూసినట్టు చూశారు. నాతోబాటు వారూ ఆయన్ను నిందించారు. కాని ఆయన వాటినేమీ పట్టించుకోలేదు. అసలు వినలేదు. నిశ్చలంగా శాశ్వత నిద్రపోతున్న పాపపై బడి రోదించారు. అదుపు తప్పిన మనసుతో అంతులేని ఆవేశంతో, కేవలం మతి భ్రమించిన పరిస్థితిలో వారు హత్యను చేశారు. మామూలు పరిస్థితిలో వారు చీమకు కూడా అపకారం తలపెట్టని మనిషి. నేనూ న్యాయవాదినే. ఇదే కోర్టుహాల్లో ఎన్నో హత్యాకేసులపై వాదించాను. నా వాదనతో ఎందరో దోషులకు శిక్షపడేట్టు చేశాను. ఇంకెందరో నిర్దోషులకు శిక్షను విముక్తి కలిగించాను. అయితే ఈనాడు కోర్టువారికి సవినయంగా మనవి చేసుకుంటున్నాను. ఒక వ్యక్తి కుట్రపన్ని, మాయజేసి, [illegible]రంజేస్తే అతను శిక్షార్హుడైన దోషి—కాని ఒకరకమైన మానసిక [illegible]తతో, యుక్తాయుక్త విచక్షణ కోల్పోయిన ఉద్రేకంతో నేర[illegible]స్తే, అతను క్షమింపదగిన దోషి. ఆ నేరం అతను చేసిందికాద[illegible]తని చుట్టూ వున్న వాతావరణం, పరిస్థితులూ చేసినవి. కేవల[illegible]దే దృష్టితో ఈనేరస్తునికి క్షమాభిక్ష పెట్టవలసినదిగా న్యాయమూ[illegible]లను వేడుకుంటున్నాను. పైగా ఆయన ఆ నేరం చేయడానికి [illegible]న పరిస్థితిని నేనే కల్పించాను. ఆనాడు నాకు పుట్టిన ఆ బిడ్డను నేను [illegible]హ్యించుకొనకపోతే, ఆమెపై నిరాదరణ చూపియుండకపోతే [illegible]ను ఆ

అఘాయిత్యానికి వొడిగట్టి వుండేవారు కారు. కనుక అసలు దోషిని నేనే....ఏమైనా శిక్షించవలసి వస్తే నన్నుకూడా శిక్షించండి...." అంటూ ముగించింది శారద.

రాఘవ ఏ పరిస్థితిలో హత్య చేశాడో వివరించి చెప్పిన శారద అభిప్రాయంతో కోర్టువారు ఏకీభవించారు. అందుకే రాఘవకు కేవలం మూడుసంవత్సరాల ఖైదుశిక్ష విధించారు. అయితే ఆ హత్య జరగడానికి తనే కారణమన్న శారద వాదనతో వారు ఏకీభ వించలేదు.

న్యాయమూర్తి తీర్పు అనంతరం పోలీసులతో బాటుగా వ్యాను ఎక్కుతూ వెనుదిరిగి తనను వెన్నంటి వస్తున్న శారదనుచూసి వేదాంతిలా నవ్వాడు రాఘవ.

"శారదా! ఒకోక్కప్పుడు మనం సరదాకు అనుకున్న మాటలు నిజమౌతుంటాయి. అప్పుడు నువ్వన్నావే, నన్ను కట కటాల వెనుక కూచోబెట్టి కవిత్వం రాయిస్తానని....గుర్తుందా ?" అన్నాడు.

ఆమె దానికేమీ సమాధానం చెప్పలేదు. అతని నోటివెంట ఆ మాటను వినగానే—ఆమెను మరొక దుఃఖపు కెరటం ముంచి వేసింది.

"అవు —వెళ్ళిరండి !...." అంటూ గిరుక్కున వెనుదిరిగి వచ్చేసింది.



అసలు పేరు :
శ్రీ వడ్డాది సత్యనారాయణమూర్తి

కలం పేరు :
"ప్రశాంతి"

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు ఇరిగేషన్
పవర్ డిపార్టుమెంట్‌లో ఉద్యోగం

ఉద్యోగరీత్యా ప్రస్తుత నివాసం తూ
గోదావరి జిల్లా కోటనందూరు.

రెండు కథలు 'ఆంధ్ర జ్యోతి' ప
పత్రికలో ప్రచురింప బడ్డాయి

వివిధ పబ్లికేషన్స్‌లో నాల్గు నవలలు
'వడ్డాది' పేరుతో ప్రచురింప బడ్డాయి
పుస్తకాలు చదవడం హాబీ-లలితసంగీత
పాతహిందీ సినిమా పాటలు వినడ
తెలుగు పల్లెల అందాన్ని అవలోకించడ
యిష్టాలు:

తెలుగులో వీరి అభిమాన రచయి
శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి, అభిమా
రచయిత్రి శ్రీమతి రంగనాయకమ్మ.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M120 |
| పుస్తకం పేరు | వవలా స్నేహ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 99 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | Bci |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | sumitha |
| పేజీలు విడదీసినది | rhasm |
| స్కాన్ చేసినది | ch. Ramya |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |